# భారతి

జూన్ 1968





వ్యవస్థాపకులు

దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులు

---

వెల ఒక రూపాయి

# భారతి

మాసపత్రిక






సంపాదకుడు:

## శివలెంక శంభుప్రసాద్



జూన్ **1968**



సంపుటము: 45 : సంచిక : 6 :

విడిప్రతి వెల ఒక రూపాయి

# విషయానుక్రమణిక

## జూన్ 1968

# సహృదయుఁడు

డా. బొడ్డుపల్లి పురుషోత్తం

**1**

అన్నమయము ప్రాణమయంబునైన కోశ
ములు సమానము జంతు సమూహమునకు;
మానవుండు మనోమయ మాత్రుఁడైన
కోరు నానంద విజ్ఞాన కోశలబ్ధి.

**2**

అట్టి లబ్ధికి సుకర మైనట్టి పథము
లలిత కళల నుపాసింపఁ గలుగు నోయి!!
యోగ మార్గాదులున్న ప్రయోజనమ్ము
అమిత కష్టనగాని సాధ్యమ్ముగాదు!!

**3**

కవియు, శిల్పియు, చిత్రలేఖకుఁడనంగ
పూర్వ జన్మంపు సుకృతాన పుట్ట నగును;
అట్టి సుకృతమ్ము నోచుకోనట్టి వార
లర్హులే తదానందమ్ము ననుభవింప॥

**4**

జానపదుఁడైన, పాండిత్య శాలియైన
హృదయగతమగు ఆనందమది సమమ్ము;
గ్రంథజడుఁడౌట కొంత కారణము గాగ
పండితుండె యొకప్పుడు మొండి వడును॥

**5**

సుఖము లోకమందు సుఖమునే చేకూర్చి
పోను పోను కష్టములకు దించు;

అనుభవించు కొలఁది అధికతరమ్ముగా
నలరు కళలొసంగు నట్టి సుఖము॥

6

లోకమందు గల్గు శోకమోదాదులు
లలిత కళలయం దలౌకిక మగు;
అట్టి మోదమంది వ్యక్తి లోకాతీత
ధీరుఁడగును; కార్యశూరుఁడగును!

7

భవ్యకావ్యానుశీలనాభ్యాసవశత
నేని మానస ముకురమ్ము విశద మగునొ
అతఁడె తన్మయీభావనయోగ్యతగడించి
హృదయ సంవాద భాజి సహృదయుఁడగును॥

8

సతత సత్కళాదర్శనాసక్త మతికి
అంతరంగ ప్రవృత్తులు స్వచ్ఛములగు;
అట్టి వానినె సహృదయుం డంద్రు బుధులు;
వాని నెంచంగ నగు, యోగివర్యు నట్లు॥

9

ఏ కళాసృష్టి నేని దర్శించు నపుడు
తత్కళాకారునందె తాదాత్మ్యమంది
సహృదయుండు తదున్నత స్థాయి నలరు;
ఇట్టి తద్భావ భావనమే వరమ్ము॥

10

కన్నులార దివ్యకాంతులఁ గాంచుము;
కర్ణములను గ్రోలు గానధార;
రమణతో కవిత్వరసము నాస్వాదింపు
మిదియె యోగరతి సహృదయునందు॥

**11**

రమ్య దృశ్యముల్ గని; మధురమ్ములైన
శబ్దముల్ విని; జీవి యుత్సాహమందు;
తత్ స్మరణమాత్ర చేత మార్ద్రమయి పొంగు
జన్మ జన్మాంతరాబోధ సౌహృదములు॥

**12**

మైత్రి, కరుణ, యుపేక్ష, ప్రేమమ్ము వలయు
క్రమత సుఖ, దుఃఖ, పాప, పుణ్యములయందు;
దానఁ గల్గు చిత్త ప్రసాదన మనంగ
అఱియు సులభమ్ము సాహితి నాశ్రయింప॥

**13**

వేదశాస్త్రత బహుపురాణాదు లెల్ల
చదువఁ జాలక యున్న విచారమేల?
కాళిదాసాది కవుల వాఙ్మయమె చాలు
దాన రససిద్ధి గల్గు నుదాత్త ఫణితి॥

**14**

వేదముల్ శాసనము సేయు విభుని రీతి;
మిత్రు గతి పురాణముల్ మేలు గూర్చు;
కాని కావ్యమ్ము సరసమౌ కాంతవోలె
నీతు లొల్కించు, కడు రమణీయ సరణి॥

**15**

కావ్య మొసరఁ గూర్చు; ఘనయశ; మర్థమ్ము;
రక్షనిడు శివేతరమ్ము నుండి;
వ్యవహరించు నేర్పు; వ్యవధాన మెఱుఁగని
నిత్య నూతన పరనిర్వృతి నిడు॥

**16**

ఇంత మాత్ర పోక, హిత బోధ గావించు
సరసమైన కాంత సరణి వెలయు;

ధర్మరక్షయందు నిర్మల కావ్యంబు
ముందు వేదములను మందగించు॥

**17**

అలసులు, విశాల బుద్ధులు నైన నేటి
మానవులకు నుపేక్ష ధర్మమ్ము పట్ల;
కామలోలత యధికమౌ కారణమున
వారిజాక్షి వారికి గురుత్వము వహించు॥

**18**

స్త్రీల గుణములందు, శ్రీ, వాక్కు, ధృతి, మేధ,
క్షమయు, స్మృతియు, కీర్తి, క్రాంతి తానె
యగుదు ననెడి పల్కు ఆలకింపవె గీత?
స్త్రీల పటిమ కేల శిక్షణమ్ము?

**19**

పురుషుఁ డొక్కరుండె పురుషోత్తముఁ డనంగ
ప్రకృతి సర్వమతని రమణి యగును
అట్టి ప్రకృతిలోన అగ్రగణ్యుండగు
మానవుం డపూర్వమైన కాంత॥

---



# కులభ్రష్టుడు

శ్రీ కొనకళ్ల వెంకటరత్నం

"అమ్మాయీ జానకమ్మా—గుండెరాయి చేసుకోవాలి మరి—పిల్లలు దింపుడుపోతారుస్మీ. ఈ వలుసులు—వీళ్లు—ఆ సోమయ్యకి ప్రతిరూపాలు—వాళ్లకోసం గతాన్ని మరిచిపోవాలి—రెక్కలు కూడదీసుకోవాలి."

శాస్త్రుల్లుగారి మాటలకి ఊరట కలక్కపోగా, కన్నీళ్లు కట్టలు తెంచుకొన్నాయి జానకమ్మకి.

జానకమ్మకి ముగ్గురాడపిల్లల తరవాత ఒక మగబిడ్డడు.

ఆ తరవాత మళ్లీ ఆడపిల్ల 'టరన్' వచ్చింది.

ఏటా కానుపే అయెను.

కొడుకు 'ఫోర్తుఫారం' చదువుతున్నాడు; వాడి పేరు విశ్వం; ఇద్దరాడపిల్లలు ఈడేరి పెళ్లికున్నారు; చిల్లరకొట్లో కుంచమూ, సోలా, గిద్దా, అరగిద్దా... ఈ మాదిరిగా ఇంటో సైజువారీగా వుంది పిల్లల పటాలం.

ఎదురొమ్ముకన రెండు కుంపట్లు కణకణలాడుతో రెడీగా వున్నాయి! మూడోది చిటపట లాడుతోంది.

'ఇంకెక్కడ కూడదీసుకోవడం—చెట్టు కూలిపోయింది—దిక్కులేని పక్షులమై మిగిలాం;' డగ్గుత్తికతో వాపోయింది జానకమ్మ.

ఆ వేళ బాకీ వసూళ్లకని ఊరూరు తిరిగి మునమునలాడుతో ఇంటికొచ్చాడు సోమయ్య. ఒంటిమీద చెయివేసి—చూచింది జానకమ్మ. ఫెళ్లున జ్వరం కాచిపోస్తోంది.

మంచం వాల్చి, తలగడ సర్ది, దుప్పటి కప్పింది! శైత్యాన్ని వచ్చివుంటుందనుకుని. చందువా పెట్టెలోంచి తీసి కస్తూరిమాత్రవేసి, ఇంత మిరియాల కషాయ మిచ్చి తెలిసీతెలియని కూరగాయ వైద్యమేదో నడిపింది ఆపద్ధర్మంగా.

తెల్లవారినాక ధర్మాసుపత్రికి పంపి ఏదేనా అరఖు తెప్పిద్దామనుకుంది.

తెల్లవారలేదు; హంస ఎగిరి చక్కాపోయింది.

పట్టుమని పదిరోజులు మంచంమీద తీసుకున్నది లేదు; తిరుగుతూ తిరుగుతూ ఉన్నమనిషిని పదపదమని కాటికి నెట్టినట్టయింది.

ఏడుపులూ పెడబొబ్బలతో మూడు రోజులు గడిచినై.

ఇంకా పిత్యకర్మ ప్రారంభించనే లేదు.

విశ్వానికి పట్టుమని పదమూడేళ్లు లేవు.

వాడికి ఉపనయనం కాలేదు.

శాస్త్రుల్లుగారు నెత్తీనోరూ బాదుకొంటూనే వున్నారు—వాడికి మూడు జందెంప్పోగులూ వేదమంత్రా అని—కాని వింటేనా? 'మా ఇళ్లల్లో పెళ్లిలోనే వడుగు—అదే మా అనవాయితీ'—అంటుంది జానికమ్మ—ఇప్పుడేమయింది?' విప్పాయి కర్మకి పనికి రాకండా పాయెనే.

ఈ రజస్వలానంతర వివాహాలొచ్చింతరవాత మరీ తెనుగువిూరిపోయింది దేశం. కలికాలం బిళ్లపెట్టుగా వచ్చిపడిపోతోంది.

ఉపనయనం—ప్రధానం—పెళ్లి—పునస్సంధానం అన్నీ ఏకొదమ్మున—ఒక్కతంతుకింద కుదించి పారేస్తున్నారు—ఏ శుభకార్యానికా శుభకారం—చక్కా—చి

విడిగా— ఇల్లు కలకలలాడుతో-గడపనింత పసుపూ— గుమ్మానికి మామిడాకు తోరణం...ఇంటినిండా బిల బిలలాడుతో బంధుకోటిగట్టా...ఇంటోకి వచ్చేపోతో బ్రాహ్మణ్యమూ...ఇంటో పవిత్ర మంత్రోచ్చారణతో ఎన్నిశుభాలు జరిగితే అంతజయకరమ్రా అంటే వినిపించుకోదుగదా ఖర్మ!

'అన్నట్టు మరిచిపోయాను – నిన్న తలవని తలంపుగ బెజవాడలో అవుపించాడు సీమ్మ...వీపా మరిది...'అన్నాడు శాస్త్రుల్లు. ముక్కుపొడుం కాయ చిటికెనవేలితో తాటించి ఒక్కపట్టుపీల్చి, కండవా మీద రాలిన దువ్వ దులుపుకున్నాడు.

అంత దుఃఖంలోనూ తేరుకొని, 'ఎవరూ? కిష్టయ్యే'...ఆత్రంగా అడిగింది జానకమ్మ

'అవును కిష్టయ్యే—కాఫీహోటలులో ప్లేట్లు కడుగుతున్నాడు—హారి నీ ఖర్మకాలా అనుకున్నంతలో, మన ఇంటో కర్మకి పనికొస్తాడుగదా అని గుర్తుకొచ్చింది—వాడికి ఉపనయనమయిందికదా—ఆ మట్లు లయలువేసి లాక్కొచ్చా—వాడికి తెలీదు పాపం సోమయ్య పోయాడని.'

మాట మధ్యలో ఎవరో వస్తున్నట్లు అలికిడయి, పెణకలు లేచిపోయి పెంకు లూడినచోట దూసుకొస్తున్న సీరెండకి అరచెయ్యి అడ్డం పెట్టుకుని,—

'ఎవరు వారూ?' అన్నాడు శాస్త్రుల్లు మొహం చిట్లించి.

నరసింహంగారొచ్చారు.

మనిషి ఉట్టిలోపెట్టిన గుమ్మడికాయల్లే కుదిమట్టంగా వున్నాడు. చెవికి ఒంటిరాయి దుద్దులు...మల్లుపంచె....సిల్కు లాల్చీ...సేలమంచు బిళ్లమడత కండువా...మూడువేళ్లకి ఉంగరాలు... అందులో ఒక ఉంగరానికి పుష్యరాగం వేయించాడు... ఉబ్బసానికీ, ఆకస్మికమరణానికీ విరుగుడని చెప్పారెవరో...ఒక ఉంగరంలో మరకతం... 'ఆకుపచ్చగా కాక సముద్రపురంగుది కొని తాపించుకో ఉంగరంలో... ఇక ఎత్తుకుంటుంది చూడు సిరి'...అని చిదంబర శాస్త్రి పూరించా డొకప్పుడు...తరవాత దాఖలా కనిపించింది కూడా...అప్పటినించీ ఆయనకి చిదంబర శాస్త్రి అంటే గురి.

నొసట విభూతిరేకలూ, చెవిలో తులసీ దళమూ...అప్పుడే శివాలయంలో గంటకొట్టి వస్తున్నాడేమో...వస్తూనే...'దణ్ణములండి శాస్త్రుల్లుగారూ' అని కూచున్నాడు బెంచీమీద.

నరసింహంగారు సంపన్న గృహస్థు—యాభై యేళ్లు దాటినై.

జానకమ్మని పలకరించాలనికూడా తోచలేదాయనకి.

నేరుగా విషయాని కొచ్చేశాడు.

'దినకార్యంమాట ఆలోచించారా?...'

'అదే అన్నాయీ ఆలోచిస్తున్నాము—కిష్టయ్య అవుపించాట్ట' అంది జానకమ్మ తలుపు వారని నిలబడి.

'విన్నా విన్నా-వాడు చెప్పినమాట వింటాడా అని?'. శాస్త్రుల్లు వంక పరకాయించి చూచారు నరసింహంగారు.

ఈ శాస్త్రుల్లు అప్పుడే కిష్టయ్య అవుపించిన సంగతి ఊరూవాడా మోగించేసి, నరసింహంగారిని వెనకాతల రమ్మని పురమాయించి ఇక్కడికి చక్కా వచ్చాడన్నమాట, అనుకుంది జానకమ్మ.

* * *

నరసింహంగారు రేఫేను కుని పుట్టినవాడు. వాడవాడకల్లా పెద్దమనిషి; అయన్ని 'అన్నాయీ' అంటుంది జానకమ్మ.

ఆయన భక్తిప్రపత్తులు కలవాడు. మొదట్లో జపాలూ తపాలూ అంత ఆర్భాటంగా పట్టించుకునే వాడు కా దాయన—కాని, దరిమిలా కమిషన్ కొట్టు మీదా, బట్టలకొట్టుమీదా, రెండేళ్లు వరాసగా కలిసొచ్చింతరవాత ఆయన పని దివిటీ లేకుండా వెంగడం ప్రారంభించింది. అప్పటినించీ • గురుడు ఏకాదశముందన్నారు—గ్రహస్థితి బాగుంటే గంగవచ్చి పంగుమీద పడుతుందన్నారు.

ఒక్కపెట్టున కిరాణాదుకాణం పెద్దవారి కొట్టయింది—పెంకుటిల్లు మేడయింది—పిల్లలిద్దరు

తెరికందొచ్చారు–తలావొక వ్యాపారంలోనూ తలదూర్చి రెండు చేతులా డబ్బు నొల్లుతున్నారు.

ఆ దెబ్బతో దైవచింతన ప్రకోపించింది ఆయనలో.

కొందరు దరిద్రంలో భగవంతుణ్ణి తిట్టి, ఐశ్వర్యమెత్తుకోగానే ఆరాధన మొదలెడతారు. తాము తిట్టిన తిట్లకీ, పెట్టిన చివాట్లకీ లొంగి వచ్చి తలబొప్పికట్టి, దారికొచ్చాడు దేవుడు అని పిస్తుందో ఏమో–అమట్న, ఆదేపోనిమ్మని, కమీషన్ కింద రెండు టెంకాయలుకొట్టి, ఒక పూదువత్తి వెలిగించి చక్కావస్తారు.

కాని–ఏమాట కామాటే చెప్పుకోవాలి – నరసింహంగారు అట్లాంటి భక్తుడుకాదు. తనకి లేనప్పుడు భగవత్కృప లేదనుకున్నాడు–అప్పుడూ, ఉదయమూ-సాయంత్రమూ గుడికివెళ్ళి వచ్చేవాడు.

అదృష్టం కలిశొచ్చింది.

ఆ కలిమి నిలవాలన్నా వాడి దయే కావాలిగదా.

చెరుకుపండేచోటికి చీమలు తామే వస్తవి! ఆయనిల్లు వచ్చేపొయ్యే బంధుకోటితో ఎప్పుడూ కిటకిటలాడుతో వుంటుంది.

ఎప్పుడూ ఏదో ఒక శుభం జరుగుతూ వుంటుందాయింటో.

లక్షవత్తులనోమనీ, నందికేశుడినోమనీ ... ఒకటే సందడి.

ఆయన భార్య సరేసరి కైలాసగిరిదేవినోమనీ, గ్రామకుంకుం నోమనీ ఎడతెరిపిలేకుండా మెడనిండా గంపెడు నగలుపెట్టుకొని బొంగరంలా తిరుగుతో వుంటుంది.

ముత్తయిదువుతనాని కేవ్రతమో, ఇంటాయన ఆరోగ్య సౌభాగ్యాని కేనోమో అన్నీ వ్రాసిపెట్టే వున్నాయికదా వావిళ్లవారి 'స్త్రీల వ్రతాల కథల' పుస్తకంలో.

ఆ మధ్య వేరుశనగలో దెబ్బతిన్నాడు.

'అదిగో – ఏటా కార్తీకంలో యథావిధిగా చేస్తున్న సత్యన్నారాయణవ్రతం...ఈ యేడు మార్గశిరానికి వాయిదా వేశావు – అదిగో మొన్న చూడా – రథోత్సవంనాడు జనార్దనస్వామి కోవెలలోకి దాగుపడిన అరిటిపండు దేవునికి నైవేద్యం పట్టికెళ్లావు – జ్ఞాపకం తెచ్చుకో', అని ఖచ్చితంగా ఎత్తిచూపాడు వెంకటశాస్త్రుల్లు.

ఉలిక్కిపడ్డాడు నరసింహంగారు.

వ్రతం వాయిదామాట నిజమేకాని అరటిపండుమీద దాగు చూచుకోలేదు మరి తను. ఏమో దిక్కుమాలిన గోల. అసలు గుడికివెళ్ళే అలవాటేలేని వ్యక్తి బేఫర్వాగా సంచరించవచ్చును. కాని, గుడికి వెడుతో, దేవుడికిచ్చే నైవేద్యంలో నకిలీ చూచుకోకపోతే బెడిసికొడుతుంది. నరసింహంగారికి తెలుసు.

ఇక పోతే, దానికి పరిహారంగా శనిత్రయోదశి నాడు తైలాభిషేకం చేయించాడు వెంకటశాస్త్రుల్లు. ఆపైన, దేవుడు మేలుచేస్తే, తిలదానం చేయించాడు–అయితే ఆ దానం వెంకటశాస్త్రుల్లు పట్టాడు. 'అట్లాంటి దానాలు పట్టనుగాక పట్టను...' అంటాడు శాస్త్రుల్లు. అందుకే ఆయనంటే గురి నరసింహంగారికి–దానికి భైరవశాస్త్రుల్ని లాక్కొచ్చి అయిదు రూపాయి లిప్పించాడు.

ఆ కార్యక్రమం తరవాత కూడా, దాని సిగదరగా, చింతపండులో చిన్నదెబ్బ తగిలింది.

అయితే, నష్టం మూడువేలు రావాలిసింది వెయ్యితో సరిపోయింది.

'రెండువేలు కలిసిరాలే?' అన్నాడు వెంకటశాస్త్రుల్లు. 'అద్గదీ' అనుకున్నాడు నరసింహంగారు.

నరసింహంగారి లెక్కలు తమాషాగావేవుంటై.

ఒక సంవత్సరం,...'పదివేలు నష్టంవచ్చింది–పదిదేలు–పదివేలు' అని ఏకఇదయ్యారు నరసింహంగారు.

మళ్లీ ఎంగిలిచేత్తో కాకిని కొట్టడు.

ఫెళ్లున వ్యాపారం సాగుతుండెను. ఒక అయిటంలో కాస్త నష్టంవచ్చినా ఇంకోపా దాంటో కలిశిరాకమానదే... ఒక వర్తకమూ, ఒక వ్యాపారమూ

ఈయనగారికి... నష్టం మెట్లావచ్చిందా అని ఆరా అడిగాడు వెంకటశాస్త్రుల్లు.

మోకాట్లో మెడనరం బెణికిం దంటాడాయన.

ఏటా ఎలా లేదన్నా సంభయ్యారువేలు లాభం వలికేదట అన్నివ్యాపారాలమీదా కలిపి—ఈ యేడు దరహామీమ్మద ముప్ఫయ్యారే లెక్క తేలిందట— అంచాత నష్టం పదివేలట!

'ఓయి నీ యిల్లు బంగారంగాను...ఇదిటయ్యా నష్టమంటేనూ?' అని వకాలుమన్నాడు వెంకటశాస్త్రుల్లు.

'ఏ కట్టాగే ఉంటుందిలే పంతులూ,' ఓరగా చూచి, ఉంగరాలచెయ్యి ఊగించుకుంటూ చక్కా బోయారు నరసింహంగారు.

మాటలు నడుస్తుండగా—

కిష్టయ్య వచ్చాడు.

టెరిలిన్ బుష్‌షర్టూ, ఖాకీ నిక్కరూ వాడూ...రౌద్రికత్తుగా వుంది మొహం.

జానకమ్మ గుడ్లనీరు కుక్కుకున్నది.

కిష్టుడు వదినని వంకరించి పరామర్శించాడు.

ఈ నరసింహంగారు ఇక్కడ వున్నాడేమా అని విహామాంస వచ్చింది కిష్టయికి. ఈయనకి అంగట్లో బెల్లం—ఆత్మలో విషం.

చక్కట్లు దిద్దడానికిమటుకు తయారవుతా డన్నిటికీ. ఎవరిచ్చారయ్యా నీకీ పెత్తనమంటే, అదిగో ఆ మూలవుంటే బజాన వేసుకున్నానంటాడు; లేలుకి పెత్తనమిస్తే తెల్లవార్లూ అంటబోడిచిం దట! ఏదో కొంప ముంచుతాడు—అనుకున్నాడు కిష్టుడు.

ఆయనకీ కిష్టయికీ మధ్య పచ్చగడ్డివేస్తే భగ్గుమంటుంది.

వెనక ఈ నరసింహంగారే కిష్టయికేమీ పెళ్లి సమంధాలు ఎక్కిరాకుండా చేశాడు.

ఆయనే తన సర్వనాశనానికి కారణమని కిష్టయ్యకి అక్కసు.

ఎవరు పిల్లనిస్తామని వచ్చినా, ఏదో సందర్భం చూసుకొని, కిష్టయ్య మిలిటరీకి వెళ్లివచ్చాడని చల్లగా ఊదేవాడాయన.

దానితో సమంధాలు తిరిగిపొయ్యేవి.

ఈయనగారు పనిగట్టుకొని ఆ సమాచారం భుజానవేసుకుని మోస్తాడేమా అని, అప్పట్లో, సోమయ్యకీ కష్టంగానే వుండేది. కాని, నరసింహంగారు ఆ మాత్రం సమాధానం చెప్పలేదూ?

'ఒరేయి సోమయ్యా' నరసింహంగారు ఎవరి నయినాసరే ఒరేయంటాడు.

'ఏదయినా మనందాస్తే దాగుతుందిట్రా?— మొదట్లోనే—ఉన్నపరిస్థితి భలానా అని మొహాన కొట్టినవాడు...ఉత్తరోత్తరా...విషం పొక్కినా...ఏ సన్మరంతీ మనమీద నెపం వేశేందుకుండదు చూడూ' అని అవుక్యంగా సర్దిచెప్పేవాడు.

కాబోలనుకునేవాడు సోమయ్యానూ.

అంచాత, కిష్టయ్యకి ఎంతకీ సమంధం కుదరని మాట చాలావరకు నిజమేను.

అయితే, ఏ వయస్సు కాముచ్చట నడవకపోతే, లీమూ నెత్తుర్రూ ఉన్న మనిషికి వొళ్లు వేడెక్కక మానుతుందా?

అందరూ కలిపి రాజవీధి మూసిపెడితే—సీడా బాయిరి—సందులూ గొందులూ పట్టాడు కిష్టయ్య.

ఆమట్ను, అదుగో ఆ అనువ్రతి నర్సు మంచా డనీ—ఇదిగో ఈ రోడ్డు మొగని ఈలవేశాడనీ పుకార్లు రేగినయ్యి తనమీద.

నర్సుమాటా ఈలమాటా నిజమే అయినా అలాంటి వార్తల్ని...కొత్తగాలిపోసుచేసి...పత్రికలలో పతాకశీర్షికలల్లే...వాటికమీద పోచ్చవేసి...నలుమూలలా పంచిపెట్టే అలవాటుంది నరసింహంగారికి.

ఆయనకి వకీలీ అంటే మతరామూ గిట్టదు మరి.

అంచాత నరసింహంగారంటే కిష్టయికి గుర్రు.

అట్లాంటి నరసింహంగారు—

'ఒరే—కిష్టి—ఇటు చూడు. ఏడవడానిక్కటా వచ్చావు? అన్నగారి ఋణం తీర్చుకో—బోధపడిందా? ఈ కర్మకాండ యావత్తూ అయిందనిపించి...పిల్లా జల్లా...ఈ కామాటమంతా...అదిగో...ఆమె వెళ్ళిన రుద్ది చక్కాబోతావో...నాలుగు రోజులు అదిగో...ఆ పిల్ల చేతికందివచ్చేదాకా ఇల్లు కాస్త నిలబెడతావో...ఆలోచించుకో.'

కర్మకాండ! కిష్టయ్యకి ధర్మసందేహాలు మొదలయినై.

వాటికి మొగుళ్ళ యక్షప్రశ్నలు!

పరుకుల జాబితా పట్టుకొచ్చాడు వెంకట శాస్త్రుల్లు.

విశ్వకర్మ ఎప్పుడు ప్రారంభించాలో, ఏమేమి పరంజాం సమకూర్చుకోవాల్నో మాట్లాడుకొంటున్నారు తరిశీలుగా.

జాబితా చూసి తెల్లబోయాడు కిష్టడు.

'ఇవన్నీ కావాలిసిందేనా?' అని వాన్నాడు.

ముల్లాలు ముస్పేత్తుకుంటూవుంటే పీర్లకి పండవారట!

గోదాన ప్రసక్తి వచ్చింది.

'గోదానమే?!' నోరు వెళ్ళబెట్టాడు కిష్టడు.

'ఒరే—కిష్టయ్యా—నోరుముయ్యి—శాస్త్రుల్లుగారూ, చూశారా వీడి ధోరణి?' ముదలకించారు నరసింహంగారు.

'గుర్రానెక్కి వచ్చావేమిట్రా? నాలుగు చకారవుగుళ్ళ తింటేనేగాని దారికి రావాయేం?'... ఆయనకి కిష్టడంటే నల్లేరుమీద బండి నడక.

'ఒరే—నాయనా—' శాస్త్రుల్లుగారు ఉపదేశ ముద్రవేశారు.

'నువ్వుదానమిచ్చే గోమహాలక్ష్మి వుంది చూశావూ—మీ అన్నయ్యకి స్వర్గప్రాప్తి కలగాలంటే—వైతరిణి అని ఒక నది అడ్డువస్తుందిలే—దానిని దాటేస్తుంది—అదీ గోదాన ఫలితం...నీకు తెలియదు గనక చెబుతున్నా.'

కిష్టడు తొణకలేదు. ఆయనకేం—చెబుతాడు—పుడితే దారపాలకట్నం—ఛస్తే వైతరిణీగోదానం—

'ఇప్పుడు వేసంకాలం, కదండీ శాస్త్రుల్లగారూ, వైతరిణీనది ఎండిపోయి వుంటుంది లెండి—అంచాత—'

'హరి నీ కడుపుడకా—వైతరిణి ఎండడమేమిట్రా? వేసంగిలోనే దానికి వరదలు!'

కామవరపు జీడిలా పట్టుకున్నాడు శాస్త్రుల్లు.

'అబ్బ—మా అన్నయ్యకి ఈత బాగా వచ్చును శాస్త్రులూ. పైగా అది వరదలమీద ఉంటుందంటున్నారా—ఆ గోవు కాస్తా బుడుంగుమన్నా, స్వర్గానికి పోతోపాతో గోహత్యాపాతక మొకటి మెడకి తగిలించుకున్నట్టవుతుంది...ఎందుకొచ్చిన గోల?'

వీడు కాలికేస్తే వేలికి, వేలికేస్తే కాలికి వేస్తున్నాడు—వీడి నోరు మూయించడమెట్లనా—అని పట్టుకుంది శాస్త్రుల్లుకి.

నరసింహంగారు వత్తాసు వచ్చారు.

'చూశారా వీడివరస—నేను చెప్పలేదుటండీ? వీడు మిలట్రీకి వెళ్ళాడుగా...మనిషి నెత్తురుతాగే మప్పు...వీడికి దేవుడా దెయ్యమా?'

మిలటరీ సంగతి ఎత్తగానే కిష్టయ్యకి చిరెత్తుకొచ్చింది.

'మిలట్రీ అట మిలట్రీ...అవును — పొట్ట గడవక వెళ్ళాను...మా అన్నయ్యకి బరువు తగ్గుతుందని వెళ్ళాను...ఎవడి కొంపా తీద్దామని పోలేదు.

అక్కడికీ మాటకి మాటతెగులని ఆ ప్రస్తావన తుంచేశాడు కిష్టయ్య.

అయినా ఘర్షణ పెరిగింది.

'చూశావా...జానికమ్మా...జాగర్తగా విను—అని హెచ్చరిస్తో నరసింహంగారు—పెద్దమనిషిగా తను వస్తే వాడి దూకుడు చూడమన్నట్టు మొహం పెట్టాడు.

ఆఖరికి కిష్టయ్య కుండబద్దలుగొట్టాడు.

'శాస్త్రుల్లుగారూ, ఒక్క మనవి...నేను కొట్లో లెక్కలన్నీ చూచేవచ్చా—మా అన్నయ్య సంసారం దిబికి పోయింది. ఇది ... చూశారూ ... ఈ యిల్లు...అద్దె కొంప...అవతలవీధిని ఓ కిరాణాకొట్టూ, నష్టమూ వుంది...అది రెండువేలకి తనఖా...చిత్తగించారా... పరిగెత్తమనేవాళ్ళేగాని, పడితే లేవనెత్తేనాథుడు కనబడడు అనక.'

వెనువెంటనే నరసింహంగారు అందుకున్నారు,

'అమ్మాయీ జానికమ్మా ... ఒక్కమాట వింటావూ? మీరంతా చిన్నవాళ్ళు...మీకు తెలియదు ... ఈ వూళ్లో మనయింటి పేరటివాళ్ళు మున్ఫయ్యిళ్ళదాకా వున్నారు...వాళ్ళంతా ధర్మోదకాలు వొదిలేందుకు వస్తారు.'

'ఆ ... వీళ్ళందర్నీ భోజనాలకి పిలవాలి సిందేనా?' కిష్టాయి ఒక చిన్నఅరుపు అరిచాడు.

'అమ్మాయీ— అంతా పంచాలించుకోవాలి... కర్మ చెయ్యాలి...చేసితీరాలి...లేకపోతే ... పుణ్యగతు లుండవుసుమ్మ...చెయ్యవూ, మాలమాదిగలకింద లెక్క, ఏమనుకున్నావేమో—చచ్చి స్వర్గాన వున్నాడు...వాడంటే మాకు ప్రాణం—ఎట్లా చేస్తావో...ఎట్లా చేయిస్తావో...ఏ ఇష్టం...ఎవరి కర్మ కెవరు కర్తలు? నా దారిన నేను పోతున్నా...నా కెందుకీ రభస?'

గిరుక్కునలేచి, దూర్వాసుడల్లే మొహం పెట్టి, విసవిస నడిచిపోయాడు నరసింహంగారు.

వాన వెలిసినట్టయింది.

కాస్సేపు మౌనంగా ఊరుకున్నారందరూ.

జానకమ్మకి బెంగ పట్టుకుంది.

నరసింహంగారి రవుద్రాకారం చూడగానే, వెనివిటికి పట్టబోయే దుర్గతులు కళ్ళకి గట్టినట్టయ్యామెకి. బ్రతికి ఉన్నన్నాళ్ళు, ఆయన సుఖపడిందిలేదు. కొట్టూ—ఇల్లూ— బాకీలూ — పిల్లజెల్లా—మాలెంత బియ్యలూ—దాలెంత బియ్యలూ— బాలారిష్టాలూ...ఇంటినిండా ఉకఉక లాడుతో కుటేం సంతానం...మొలచుట్టూ తాయెత్తులూ... మెడలో కోరింతతాళ్ళూ...శ్లేష్మంతో ఈళగలా కొట్టుకున్నాడుః పరలోకంలో అయినా...

జానికమ్మకి ఆ లోకం ఎట్లా వుంటుందో వర్ణించి చెప్పారంతా...అక్కడికి వెళ్ళి, అదంతా స్వయంగా చూచి వచ్చినంత స్పష్టంగా...పూస గుచ్చినట్టు మర్లీ...

ఆమె వొణికిపోయింది.

శాస్త్రుల్లు రాజీ ధోరణిలో పడ్డాడు.

'అయితే, కిష్టయ్యా, ఏమంటావురా మరి?' ఆయన చెవుల కుండలాలు అల్లాల్లాడాయి.

'నేనంటాను శాస్త్రుల్లుగారు ... నామాట కొట్టెయ్యకండి...రెండుసేర్ల బియ్యం తెస్తాను... కాస్త నువ్వుగుండ కలిపి అక్షింతలుచేసి తంతు జరిపెయ్యండి...ఆఖర్న ఓ అర్ధరూపాయి దబ్బులు మొట్ట చెలతాను తమకి...మా అన్నయ్యని తలుచుకుని, కళ్ళుమూసుకుని, ఆయన జ్ఞాపకార్థం ఒక దణ్ణం పెడతాను. ఆ తరవాత మా ఏడుపు మేమేడుస్తాము. మా ఖాతాన మమ్మల్ని వొదిలెయ్యండి...'

'ఏమి ఓమిటే?' — శాస్త్రుల్లు కొయ్యబారి పోయాడు.

'కాదంటారూ...నా దారిన నేను పోతా... చేతులారా ఈ పిల్లలందరి నోట్లోనూ మట్టిగొట్ట లేను నేను' చివాల్నలేచి తుండుగుడ్డ సవరించుకున్నాడు, కిష్టుడు.

జానికమ్మ బ్రతిమలాడింది. బామాలింది... కాళ్ళావేళ్ళా పడినంత దీనంగా వేడుకొంది—

'కిష్టయ్యా...ఏదో ఒహాలా గట్టెక్కించు నాయనా...మమ్మల్ని ఈ నట్టేట్లో ముంచి పోతావా? ఆ కర్మకాస్త అయిందనిపించి...మీ అన్నయ్యకి గతులు కలిపించు నాయన్నాయన...'

'అబ్బ...అదికాదు వదినా...కర్మ చెయ్యననటం లేదు నేను...చేస్తా...ఇంటో తిర్లిగవ్వలేదు...ఎట్లా చేయిస్తారో చేయించండి శాస్త్రుల్లుగారూ...ఇంటో మంచి నీళ్ళు మినహా మరి సామగ్రి లేదు.'

ముక్కాలిపీటమీద గొంతుక్కూచున్న ముసు

కులమర్యాద తలక్రాయివుంచి, మెదలకుండా ఊరు కున్నాడు కిష్టాయి.

కిష్టడికి అన్యాయ్యంటే భయముండేది. కాని నరసింహంటే భక్తి.

ఈ సంసార మొక మహాసాగరమైతే అందులో నిలువీత ఈదుతున్న ఇల్లాలామె.

'కాళ్ళు పరుకులువున్నాయిగదరా...నీది మరీ అడివిగోలరా కిష్టాయి,' అని అందించారు శాస్త్రుల్లు— ఆటువింపి పరుక్కొద్దామని.

'ఆ తరవాత కొట్టు తెరవక్కర్లేదూ? అలా వుండనీండి...మరి దానాలు, దక్షిణలు, సంభావనలు... పాత్రుల్లు...ఎంత భారీతతంగమూ?'

'నువ్వు అట్లా అంటున్నావు గానట్టే—నోరే— నేను వెళ్ళి మాట్లాడివస్తానుండు నరసింహం గారితో...ఆయన తలుచుకుంటే...' అని అందించారు శాస్త్రుల్లు.

కిష్టాయి దానితో కాస్త వుండాకున్నాడు.

'హాఁ—దివ్యంగా...నరసింహంగారు తలుచు కున్నట్టయినా...ఇదెంత మహాకార్యమండీ...మా వాళ్ళ యిళ్లల్లో ముప్పయిదాకా వున్నాయండీ ఈ వాడ కట్టులో—ఓ నాలుగు వందలు అందర్నీ కూడాగట్టి అడ్డం వెయ్యమనండి...నరసింహంగారు శాక్కరూ, దమ్మసంధానమ, నో నాలుగు వందలు గిరాటెయ్యగల మోతుబరి.'

'దాని సిగదరగ, ఒక ఎనిమిది వందలు పుట్టించలేమ్మిటా' ఏకాస్త్రిగా నశ్లిపాటు పచారింతు కున్నాడు శాస్త్రుల్లు.

దగ్గరికి జరిగి —

'మీరు చెప్పడంలో వుంది శాస్త్రుల్లుగారూ,' అని ఎగసదోశాడు కిష్టడు.

'అదే—నోటు ఎవరిపేర వ్రాయించనా అని?' నాపాలవంశ మూవి మీసమేషాలు లెక్కపెట్టాడు శాస్త్రుల్లు.

'సరిపోయింది—నోటేమిటి?' తెల్లబోయాడు కిష్టడు.

'నోటు లేకండా ఎవడిస్తాడురా అప్పులూ?'.

మొదటికొచ్చింది వ్యవహారం.

'అదేమిటి? అప్పులా ఏనా రంటూంటా?'

'ఏడిచినట్టే వుంది...దండాలు పెట్టుకుని వచ్చాయి చేస్తారనుకుంటున్నావేమ్మిట్రా మరి? ఒరేయి—ఎంతెం తాలోచన లున్నాయిరా నీ కడుపులో? అందులోనూ నరసింహంగారా చేతివమురు భాగోతాంకి దిగేది?... సరిసరి' నీళ్ళు గార్చాడు శాస్త్రుల్లు.

ఆ సందు చూసుకొని, జానకమ్మ శాస్త్రుల్ల గారిని తరిమింది.

'అతనితో ఏమిటిగాని, మీరు వెళ్ళి నరసింహం గారితో మాట్లాడి నోటు వ్రాయించి పెట్టుకురండి శాస్త్రుల్లుగారూ—నేను సంతకం చేస్తా'నంది.

ఈ కిష్టడు వ్యవహారం మళ్ళీ తిరగదోడినా తోడవచ్చుని అమట్నే గబీమని అటుకేసి ఉడా యించారు శాస్త్రుల్లు.

కిష్టాయి కిదంతా అయోమయంగా వుంది.

'నాయన్నాయన — ముండ గబ్బెక్కించు' అంటుంది జానకమ్మ.

గబ్బెక్కించడమంటుం దేమిటి? గోతిలోకి నెట్టడమిది. ఆమెకి తెలీకండా వచ్చింది ఖర్మ.

'నాకు నిజంగా భయంగా వుంది వదినా...ఈ అప్పులూ...ఈ ఖర్చులూ...'

'నాయనా—కాస్సేపు చెప్పినట్టు విను—రేపు అమ్మాయి పెళ్ళికున్నదా...ఇప్పుడు సలక్షణంగా ఈ ఖర్మకాండ చెయ్యకపోతిమా, వెలివేసినంతపని జరుగు తుంది. సిషందుంమని యాగీ చేస్తారంతా...ఒక్క నరసింహంగారే కాదు...నువ్వెరగవూ? ... నీ పెళ్ళి ఓ పట్టాన కుదరనిచ్చారా? మిలటరీకి వెళ్లావనీ... అడ్డమైన తిట్లా తిన్నావనీ...తేళావనీ...ఒకటేమిటి?'

కిష్టాయి అప్రమితంగా కాస్సేపు అటూ యిటూ పచారు చేశాడు. వొంటని తేళ్ళా, జెర్రులూ పాకుతున్నట్టుంది అతగాడికి.

'అయితే ఇక తప్పేదేముంది? నేనే పంపింపాం

గారి దగ్గరికి వెళ్ళి నోటు వ్రాసి పట్టుకొస్తే, నాక
ఎనిమిది వందలు...మళ్ళీ ఈ వంతక మెందుకూ?'

చీడీలు దిగాడు కిష్టుడు.

జానకమ్మ మనస్సు కుదుటబడింది.'

* * *

కర్మ యథావిధిగా పెట్టాడు కిష్టుడు కిమ్మనకుండా.

తిలదానం, హిరణ్యదానం, ఆజ్యదానం...ధాన్య దానం, గుడదానం, ఉదకుంభదానం, లవణదానం... దశదానాలూ ఇప్పించారు. నరసింహంగారు దగ్గరుండి కంబాయింపుగా అన్నీ యథావిధిగా చేయింపించారు.

భూదానానికిమటుకు వేలగిల్లి ఊరుకున్నాడు కిష్టయ్య. సోమయ్యకున్నవి రుద్రభూములే ఆయెను.

అగ్గపాత్ర ఇప్పించారు ఘనంగా.

చుట్టాలుపక్కాలు వచ్చివున్నారు.

రాకపోతే రాలేదని విస్మార ముఖటాయెను.

భోజనాలు నడుస్తున్నాయి—పదోరోజు.

తనగవస్య 'బ్లాక్'లో కొనాలిసివచ్చినా బూరెలు చెయ్యడం తప్పలేదు. గారెలు పరేసరి— పితృదేవతలకి ఇష్టంట.

మజ్జిగ ఉపాధారవుపిళ్ళనీ, వెయ్యిరాడు వడ్డిస్తే, కేవలం డాల్డాఅనీ భోక్తలు పెదవి విరిచారు.

కాని పొదుగుదగ్గర పితికిన పాలకీ, పచ్చ కర్పూరంలాంటి విభార్చయిన వేప్పక్కకీ చెల్లించాలిసిన రేటునే చేతివమురు వదిలింది. అది లగ్గపరి కూడాను—వంటమనుషులు రోజుకి ఎనిమిది రూపాయల చొప్పునగాని పలకలేదు.

మారువడ్డనకిరాని అయిటము లేవో గుర్తు పెట్టుకుని, గుచ్చిగుచ్చి మరీ జ్ఞాపకం చేస్తున్నారు కొందరు పెద్దలు.

డాల్డా అని అనుమానం ముమ్మరంగావున్నా, వేతియూరి వచ్చినప్పుడుమాత్రం, బూరెలకి, మావుడు పేటు మరీ పన్నమవిపించి తొటుపవేలితో! భోక్తలు పాటివి రెట్టిగా ఉండటంతో భోక్తలు ఏమరుపాటు లేకుండా చురుగ్గా వ్యవహరించారు.

'ఏమోయ్ బావా — ఇంకో నాలుగు గారెలు వేయించుకోరాదూ — అట్లా వెయ్యండి సార్...ఇట్టే అరిగించుకోగలదులెండి...ఎవరో తెలుసాండి? పేరె గణపతి!'—ఒక పోతరాజు 'రికమండేషన్.'

అవతల పంక్తిలో కూచున్న ఆ పోతరాజుకి, తనమీద, ఆదరుత్తగా, ఆప్యాయంగా, అంతవేలు మమత్వం ఎందుకు పుట్టుకొచ్చిందో చట్టున స్ఫురించక...పళ్ళికిలించి చక్కా ఊరుకున్నాడు...ఇవతల పంక్తిని చిన్నట్లో ఖుషీ పడుతున్న గణపతి.

ఎందువా కాకపోయినా...ముఖ్యంగా పంక్తి భోజనాల్లో...సిఫార్సు లెందుకుచేస్తారూ? సిఫార్సులు తిరిగి చేయించుకుందుకు...అన్న ప్రాథమిక సూత్రమైనా అర్థంకాని గణపతిమీద ఆశ వొదులుకుని, ఆ పోతరాజు...మరో యంత్రమ్మాని పట్టుకున్నాడు తన ప్రయోగానికి.

'అమ్మాయ్...ఆ చక్రపొంగలి చుప్పన తినవే నీ దుంపతెగా...మళ్ళీ మాలొస్తుంది...ఏడువు...పులుసన్నం వొదిలేస్తున్నావులే...చక్రపొంగలి తిను ముందు...చేనలవాగమ్మ! అన్నీ చెప్పాలి'—

ఒకామె, కక్కుర్తి...అలవాట్లింకా వొంట బట్టించుకోని ఎనిమిదేళ్ళ కొమార్తెని, ఏక మోచేత్తో పొడిచేస్తోంది.

అటూ యిటూ చూసి, 'మరి తినకుండిపో తున్నాను గావును,' అనుకొని అలిగా నోట్లో కుక్కుకుంటున్నదాపిల్ల.

మధ్యమధ్య, 'గోవిందా' అనీ, 'అక్రూరవరద గోవిందా, ఆంజనేయవరదగోవిందా' అనీ బైకొడుతో కొందరు పెద్దరికం వహించి ఆ మిషమీద పొట్టల్లో ఆత్మారాముణ్ణి కాస్త సందిమ్మని హడంగొడుతున్నారు.

భోజనాలు కొందరి వయినై—కొందరివి కాలేదు.

పంక్తి పంక్తి...ఏకంగా...ఒక్కసారే లేవాలి గనకనూ...తాతిగా కూచోవలసి రావడంతో...లోపల

కాస్త ఖాళీ మిగిలివున్నట్టు అనుమానం పోకిన్నీ... భోజనాలు ముగిసిన కొందరు పెద్దలు గ్లాసుల్లో పెరుగుపోయించుకుని, గారెలు మారుస్తుటమ్మనీ, పొదిలేసిన వడియాలు కరకర నములుతోమూ, పాపం ఇబ్బందిగా కాలక్షేపం చేస్తున్నారు.

విస్తళ్లలో తిన్నంత మిగిలిపోయింది.

భోక్తలు తృప్తిగా భోంచేసి బ్రేవుమని త్రేమ్తుంటే జానకమ్మకి అనిర్వచనీయమైన ఆనందం కలిగింది.

సోమయ్యకి విస్తరివేసి, పులుసు మరిగిందా, కూరలో కారం సరిపోయిందా అని అయిటంవారీగా ఆరాలడుగుతో కొసరికొసరి వడ్డనచేస్తున్న వయనం గుర్తుకొచ్చిందామెకి.

కిష్టయి వడ్డనలో మునిగిపోయినా, అటూ ఇటూ పారజూచుకుంటూ వేవున్నాడు. అతగాడికి ఒకటే దేవుతున్నది లోపల; ఎన్నివిస్తళ్లు పడుతున్నదీ, ఎన్ని బంతులు లేస్తున్నదీ ఒకటే లెక్క. వేటిధూరి తొండమెంత లావుగా వున్నదీ, గాడిపొయ్యిమీద గారె లెన్నివాయిలు తీస్తున్నదీ, ఎంత పదార్థం వేస్టయిపోతున్నదీ ఒకటే మధన. సరిగ్గా తూచి నట్టు ఎంత భోంచెయ్యగలరో టొటాటొటీగా అంతే వడ్డన చెయ్యగలవాడెవడు?

అక్కడికీ లోపాయకారీగా, వంటమనుషుల్తో కాస్త చూచి వడ్డించమనీ, పెద్దలకీ, పిన్నలకీ ఒకే మోతాదుతో వడ్డన చెయ్యవద్దనీ, వద్దంటుంటే మొండిగా, పట్టుబలవంతాన, పిండివంటలు వడ్డించ వద్దనీ ముందుగా హెచ్చరిక లివ్వనే ఇచ్చాడు.

అయితే, పురమాయించిన నగకి పట్టే బంగారం విషయంలో కమసాలికీ—భోజనాలలో వండి వడ్డించే—వంటమనుషులకీ — అలాంటి కాకీవాలు మతరామూ గిట్టవు...పరికదా...ఆ సందర్భాలలో వాళ్ల చేతులు మంచిధారిగా వుంటాయి.

పదార్థం తమది కానప్పుడయినా దృక్పథం విశాలం కాకపోతే ఎట్లా?

గోదాన మిచ్చారు.

జానకమ్మా, కిష్టయ్యా, పిల్లలూ... చుట్టూ ముమ్మారు దర్భంపెడుతో ప్రదక్షిణ చేశారు. తోక ఎత్తి పట్టుకొని ... బ్రాహ్మణ్యం మంత్రాలు చదువుతో నీళ్లు ధారపోశారు—యథావిధిగా గోదానం జరిగింది.

ఆవు కాస్త కుంటిది.

నరసింహంగారు కిష్టయ్యని పిలిచి చివాట్లు వేశారు.

'అక్కడికీ మాటపడి వెల్లించాము బాబాయ్... ఆ కుంటిగావి లేకపోతే రెండువందల పైచిలుకు మాట.'

కిష్టయ్య మాటిమాటికీ ధనాళాపం వెళ్ల బొయ్యడం మహచికాగ్గావుంది నరసింహంగారికి.

'కాని డబ్బేదీ?'—ఒకటే పాట కిష్టడు.

'నోరుముయ్యరా!' గదమాయించారు నరసింహంగారు.

వాడి కర్మంకాదు. అదీ వచ్చిన అపఘాత.

మెల్లిగా పక్కకి తీసికెళ్లి బోధపరిచారు నరసింహంగారు.

'దీనితో మూడో గోదానంస్మీ ఈ శాస్త్రుల్లు వడగా తెలుసా కిష్టిగా?'

'కావచ్చు.'

'ఏ శ్రార్ధం. అని గోవుల్నేమి చేసుకుంటా డురా ఈయన?'

'కొన్ని అమ్ముకొని.'

'ఈ కుంటిదాన్నెవడు కొంటాడు?'

'కొనకపోతే మానె—ఆయన దగ్గర్నే కుంటనీ.'

'ఎవడూ కొనకపోతే...గబేళాకి తోలతాడురా వాజా'—

చెవి మెలేశాడు నరసింహంగారు.

కిష్టయి కిదంతా గాడిదగత్తరగా వుంది.

'గోవుని దానమిచ్చినతరవాత ఆ బ్రాహ్మడు దానిమేచేసుకుంటే మన కెందుకూ?' అంటాడు [illegible]గా.

'పోరా పోకిరీ.' మొహం చెండ్రుకుని పెద్దపెద్ద అంగలు వేసుకొంటూ వెళ్ళిపోయారు నరసింహంగారు. దెందులోవున్న తిరకాసు వాడి బుర్రకి పట్టించే అట్లాగ ఆయన కెంతకీ తెమలలేదు.

కాని నరసింహంగారిచ్చిన హెచ్చరికలు ఖాతరు చెయ్యనందుకు కిష్టయ్య త్వరలోనే గుణపాఠం నేర్చుకున్నాడు.

తరవాత కొన్నాళ్ళదాకా ఆ గోమాత సంత పాటిమీద పుచ్చువంకాయలు తింటూనో, రాత్రిళ్ళ పెంటకుప్పలమీద పుల్లిస్తరాకులు పెళ్ళగించి కరకర నములుతూనో అగుపించడం జరిగింది కొందరికి. దానితో, అది అక్కడక్కడే కాలక్షేపం చేస్తున్నదనీ, దానికి కడుపే కైలాసమనీ, అది అన్నాయిని వైతరణీ నది దాటించాలిసిన పనిమీద అటుకేసి వెళ్ళిన పాపాన పోలేదనీ, దాన్ని అటు పంపాలిసిన బాధ్యత దానం పట్టిన బ్రాహ్మణోత్తముడికి ఏ కోశానా లేదనీ, కిష్టయి గ్రహించాడు. అసలు దాని పోషణ తన కర్తవ్యం కావట్టు దాన్ని రికామీగా వదిలి ఊరుకోవడంలో ఆ పెద్దమనిషి ఉద్దేశ్యం ఏమిటో అన్నీ విశామాంసకూడా వచ్చింది.

తరవాత దశ దాన్ని గబేలాకి పట్టించడంకాదు గదా!

చుట్టుపక్కల అంతా ఖంగారు పడిపోయారు.

'గోదానం చెయ్యకుండానే ఉండాలిగాని, తీరా మోపి గోదానంచేసి, దాన్ని గబేలాకి తోలే పరిస్థితుల్ని చూస్తూ చూస్తూ ఉపేక్షించి ఊరుకున్నట్టయినా, పుట్టగతులుండవురా నాయనా' అని చెవినిల్లు గట్టుకుని పోరి, కడాపటికి కిష్టయి చెవులు మెలేసి, దానం చేసిన ఆవుకని ఆరునెలల గ్రాసం ఇప్పించేదాకా నిద్ర పోలే దెవరూ.

చిత్ర మేమిటంటే ఆవుని దానంచేశాంగదా చేసి దాన్ని గాలికో వొదిలి ఊరుకున్నట్టయినా, దాన పరిగ్రహీత దివ్యతకోరంగానే వుంటాడు; ఎటొచ్చీ దానమిచ్చిన గృహస్థుమాత్రం అగ్గగ్గలాడిపోవలసిందే: చేతులు ముడుచుకుని కూచుందుకులేదు—పీతాంబరం ఎదురిచ్చినమ్మ పీట వెంటబెట్టుకుని తిరిగినట్టు గోదానమిచ్చిన గోదాతకీ తప్పవీ అరళ్ళు.

వీళ్ళందరికీ గోరక్షణం టే ఎంత ప్రీతో తెలిసొచ్చింది కిష్టయికి.

అప్పనంగావస్తే దాని పాలు పిండుకుని త్రాగి త్రేన్చేదీ, పేడకళ్ళు తీసి పిడకలకింద చరుచుకొని పొయిలో పెట్టుకునేదీ, దాని మొహాన ఇంత పసుపూ కుంకుమా పులిమి—గట్టి తప్పుడూ కాదు—'ఆవు పవిత్రమయింది' అని లెక్చర్లు దంచేదీ!

'మెడ్రాసులో ఆవులు మరీ పవిత్రమయినవి—పుల్లిస్తరాకులు తిని పూటకి రెండు సేర్లు పాలిస్తాయి!' వేళ్ళసందున సిజర్ సిగరెట్టు ఇరికించుకుని, నాలుగు రోడ్ల మొగని, నలుగురు స్నేహితులమధ్య కిష్టయిచ్చిన చిన్న ఉపన్యాసం చెవినపడి, నరసింహం గారు అగ్గిమీద గుగ్గిలం మయిపోయారు.

* * *

సంచయనం —

అనంతరం పిండప్రదానం జరిగింది.

కాకులు మెతుకులు ముట్టలేదు.

ముదురుగోడమీద కొన్నీ, జామిచెట్టు వంగిన కొమ్మల్లో కొన్నీ, బిక్కుబిక్కుమంటూ కూచుని, నిక్కినిక్కి చూస్తున్నాయి కాని ఒక్కటీ వాలదు.

జానకమ్మ చేతులు కట్టుకొని—కన్నీళ్ళు పెట్టుకొని—పెరట్లో వసారావార నిలబడి—'దేవుడా—నా లోప మేమున్నది? పిల్లల్ని జాగర్తగానే చూస్తా—తీరని కోరికలుంటే చెప్పు' అని దీనంగా వేడుకున్నది—తీరని కోరికలంటూ కొన్ని వున్నట్టు!

పిల్లల్ని వచ్చి దణ్ణం పెట్టుకోమంది.

కిష్టయి కిదంతా నాటకఫక్కీగా వుంది.

వీళ్ళందరికీ—అన్నాయి తాలూకు ఆత్మ ఈ కాకుల్లో దూరి అక్కడ పెట్టిన పిండాకూటికి అంగలారుస్తున్నదనే నమ్మకం గావును.

కిష్టయిని వచ్చి దణ్ణం పెట్టుకోమంది జానకమ్మ.

కాని, 'పిల్లంకేమీ అన్యాయం జరగదు' అని అన్నాయి ముందు అబద్ధం పంకబుద్ధింకాలేదతిగాడికి—జరుగుతున్నదే అది.

'రోజా కంచాలు కడిగేముందు, ఏవో నాలుగు మెతుకులు విదవడం గగనమయ్యేది—ఇవాళ, ఓ చిన్న కుంభంకింద—ఇంత పొచ్చిడిగా విస్తట్లోవుంచి—హుష్మనకుండా, హుష్మనకుండా, ఇంత ఉదారంగా—హటాత్తుగా ఎలా మారిందా ఈ యింట్లో జనాభా—పక్కనక్కళ్ళి ఏ పరాధముడైనా పొంచివున్నాడేమో దెబ్బతీసేందుకు—'అని ఆ కాకిమూకకి పంకోచంగా వున్నదేమో గాల—మనిషిలో జీర్ణించి పోయిన టక్కుటమారీ విద్యలన్నీ మనుషులమధ్య మసిలే కాకిమూకకి మాత్రం గ్రాహ్యంకాకుండా వున్నాయ్యా?

'కాస్త అంతా లోపలికి పదండి—కిటికీల వెనకాలా, గుమ్మం పంచనా అలికిడి చెయ్యకండి' అని గద్దించాడు కిష్టయ్య.

'సోమయ్యకి తీరని మొక్కు లేమైనా వున్నయ్యేమో.' అందించిం దొక ముసలామె.

ఏమో—ఎన్ని కష్టాలకి తలవొగ్గాడు: ఎన్ని అనదలు విరుచుకుపడలేదు!

కంపవబడ్డ కాకిలా ఎంత విలవిల్లాడాడు పంసార మీడుస్తూ.

'ఏ మొక్కయినా—కనీసం తిరపతి మొక్కయినా మొక్కకుండా వున్నాడో?' అని జానకమ్మకి అనుమానం పొకనే పోకింది.

కిష్టయ్యకి గుండె వేగంగా కొట్టుకుంది.

'అన్నాయి మొక్కని మొక్కులూ,—మొక్కకుండా వున్నాడా' అని లీలగా పంశయాస్పదంగా మొదలై—చల్లగా రూఢీఅవుతున్న మొక్కుబళ్ళా—ఇలాటి దుణాలూ, దస్తావేజాలూ ఏమయినా 'పెండింగులో వున్నా—రద్దుచెయ్య మహాప్రభో' అని అన్నవరం సత్యనారాయణకో, సింహాచలం అప్పన్నకో, తిరపతి వెంకన్నకో, యాదగిరి లక్ష్మీనృసింహస్వామికో—ఎందుకేనా మంచిదని పన్నగబాలకీ, మందపల్లి శనైశ్చరుడికీ—స్వగతంగా విన్నవించుకున్నాడు కాస్సేపు.

మొక్కితే దేవుడు కాస్తాడన్న నమ్మకంలేని కిష్టయికి—మొక్కుబళ్ళ వొత్తిడినుంచి తప్పించమని వేడుకుంటే మొర వింటాడన్న నమ్మకం చిత్రంగా అంకురించింది.

యుద్ధంలో 'గ్రెనేడ్లు' విసిరినప్పుడూ, బ్రెన్‌గన్ పేల్చినప్పుడూ, టపటపమని చెట్టుమీద నుంచి ఆకులు రాలినట్టూ, 'ఠాన్ టన్ లో' టుంపు లెగిరి పడినట్టూ, తలకాయలు విచ్చి రాలినసిపాయిలని వేనకివేలు చూచాడు కిష్టయ్య—వాళ్ళల్లో ముప్పాతిక మువ్వీసం—అది దేశసేవకింద లెఖ అని రేడియో ఎంత గొంతు చించుకొన్నా—ఏదో దేశాన్ని ఉద్ధరించడంతో పాటు—వొంటినిండా ఖాకీ గుడ్డ లేసుకుని, కడుపునిండా పలావులు తిని, రాత్రిళ్ళు మజాచేస్తూ, చచ్చినా మాటాగే అని పొట్టచేత్తో బట్టుకుని రిక్రూటింగు ఆఫీసరు ముందు హాజరయిన బాపతే కాని, చచ్చింతరవాత గూడా ఈ పిండాకూటికని దేవిరింపు మిగిలే వుంటుందని తెలిస్తే—ఓ పట్టాన—ఆ ఛాయలకే రారేమో. దరిద్రానికి ఝడిసి, చావుకి తెగించినా తిండిరంధి తప్పకనే పోతే, ఇహనేందారి!

* * *

నాలుగు రోజులు గడిచినై.

కిష్టయ్య కొట్టుదగ్గరికివెళ్ళి చెక్క తలుపులు తెరిచాడు.

కొట్టు కాస్త ఊరిబయటే అయినా, చుట్టు పక్కల గ్రామాదులకి సెంటరు లాంటిది. ఆ చిల్లర కొట్టుమీదనే పంసారమున్నాళ్ళా ఈదుకొచ్చాడు సోమయ్య.

చుట్టూతా ఖాళీస్థలం—ఓ వెయ్యి గజాల మేరకి—పలుచదరంగా వుంది.

దుకాణంలో దినుసులు పంచబడినై; ఉప్పుంటే పప్పులేదు; పప్పుంటే చింతపండు లేదు; చిల్లర సరుకులు ఒకటి దొరికి ఒకటి దొరక్కపోతే, అన్నీ దొరికే చోటికే పోతారు పలుగురూను.

అంతే జరిగింది.

పోపుల డబ్బాలో అట్టడుగున మిగిలిన మిరపకాయ తుంపుల్కోసం దేవులాడుతో—

'రాయవా–కిష్టయ్యా – అమ్మకాలు సాగుతున్నయ్యా?' అని అడిగింది జానకమ్మ.

'అమ్మకాలేమిటి? అసలు కొట్టు తెరుస్తుంటేనా? సరుకులేవీ?' అన్నాడు కిష్టయ్య హాలులో పచారుచేస్తూ.

'అన్నట్టు మొన్న దినకార్యానికని వెచ్చాల కింద వాడుకొన్నాంకదూ' అని జ్ఞాపకం వచ్చింది జానకమ్మకి.

'పోనీ కొత్తసరుకులు కొనలేకపోయినావా?'

ఇల్లు అయ్యవారి నట్టిల్లు అయిందన్న విషయమింకా ఆమెకి తెలిసిరాలేదు.

కొత్తసరుకులు కొనాల్నంటే డబ్బుకావాలనీ, డబ్బు ఖర్చయిపోయిందనీ, కానీ అప్పు పుట్టడంలేదనీ ఆమెకి తెలిపొచ్చేవరకు కొంత టయిముపట్టింది.

విడమర్చి చెప్పాడు కిష్టయ్య.

తీర్చే స్తోమతు సన్నగిల్లిన తరవాత, చేబదుళ్లయినా పుట్టవు.

సోమయ్య బ్రతికివున్నాళ్లా గుంభనగా నడిచిన రథం, అతగాడు కన్నుమూయ్యగానే, చక్రాలు విరిగినట్టయి, కిరకిరలాడుతున్న చప్పుడే.

ఇక పోతే, అంతవరకూ ఎవరికీ తెలీకుండా దాగివున్న రహస్యం—ఏదీ–ఆ కొట్టుమీద యింత ఋణమున్నదీ అంత ఋణమున్నదీ అన్న విషయం — అగుబ్బుగా చెప్పుకుంటున్నారు నలుగురూ.

బర్రె ఛస్తే, అది ప్రొద్దుటేళ ఇన్ని పాలిచ్చేది, వయటేళ ఇన్ని పాలిచ్చేదీ అని ఇంటి యజమాని బావురుమనటంలో పైకి పొక్కుతుంది: కాని మనిషి ఛస్తే, ఆ శవంమీద దుర్వాసనకిముందే అతగాడు చేసిన ఋణాలు బైటకొస్తయి.

జానకమ్మ పెద్దమ్మాయి సరుసుని పొరుగింటికి బియ్యం బదులుకని పంపింది. ఆమె ఇంకా గడపదాటి బైట అడుగు పెట్టటంలేదు. పెనిమిటి గతించి ఇంకా నెల తిరగలేదు. తెగించి వీధిలోకి తొంగిచూచిందా, కొంప అంటుకుంటాయి. కొత్తగా ముండామోపిన ఆడకూతుర్ని ఇమ్మలోగిటి మళ్లే చూచి అనేంటా తొలిగిపోతారాయెను అమ్మలక్కలు.

అంచాత పెద్దమ్మాయి సరుసుని పంపింది.

'ఏదీ–బియ్యమింకా తీసుకురాలేదుగా — మా చిన్నాడేమో ఇదిగో అదిగో అని జాప్యం చేస్తున్నాడు'– అని సాగదీసింది పొరుగింటి కామాక్షమ్మ. పక్కగదిలో...తలుపువారని...బియ్యంమూట ఆ పిల్ల కంట బడుతుందేమో కొంపతీసి అని...తురతుర...బైట గుమ్మందాకా వొచ్చి మరీ తొంటచెయ్యి చూపిందామె. అసలు సరుసుని లోపలికి రానిస్తేనా?

జానకమ్మ వింటోనే వుంది.

ఇక ఆ చుట్టుపక్కల తనకి బదులు పుట్టదు గావాలు.

కిష్టయ్య సైతం చేబదుళ్లకని తడిమన్ను పొడిమన్నయ్యేలా తిరుగుతోనే వున్నాడు. ఒకచోట దొరక్కపోగానే ఇంకొకచోటకి వెళ్లాలిసివచ్చి, ఎక్కడా అప్పు పుట్టకపోగా, అప్పులకోసం కాళ్లు అరిగేలా తెగతిరుగుతున్నాడని చుట్టుపక్కల టాంటాముయిపోయి, ఎవడికివాడు జాగర్తపడుతున్నాడు.

'అరె–నిన్న అడిగితే–వదేమిటి ఖర్మ – పదిహేనిచ్చేవాడే '–అని నాలిక కొరుక్కున్నాడు నారయ్య.

'అరె–క్షణంక్రింద శంకరాన్ని అడిగి ఇరవై తెచ్చాను అవసరమై–శంకరాన్ని కదిపి చూడు–నేను చెప్పానని నాలిక జారేవుస్మీ'–అని ఉపాయాంతరం సూచించాడు ఉమాకాంతం.

'సరే–నన్నే అడిగావు? అసలేమిట్రా పరిస్థితి...తణఖామీద ఏమాత్రం ఋణం తెచ్చాడురా సోమయ్య? ఎక్కడిన్నుంచీ అంటా?'–పైపై రాల్చుకపోగా, కూపీలు తియ్యబోయాడు ఒకానొక లక్ష్మయ్య.

అసలు కిష్టయ్య అడిగే ధోరణిలోనే కొంత మిలిటరీ పద్ధతి అవుపించి, 'బదులివ్వకపోతేనే తన్నేలా ధిమాకీ చేస్తున్నాడు—తీరా ఇస్తే–అది వసూలయ్యేవరదాకా నమ్మకమేమిటి' అని తప్పుకున్నారు కొందరు.

ఇలా కాదని కొట్టుమీద రావాలిసిన బాకీలేమున్నాయో అని అవరా తిరగేశాడు కిష్టుడు.

నరసింహంగారు వాడుకున్న బాపతు మూడు వందల చిల్లర వుంది. అది చేతికొచ్చినట్టయినా కొట్టు తెరవవచ్చును—అవసరానికి ఆ మాత్రం సర్దలేక పోతాడా—అనుకున్నాడు కిష్టయ్య.

మర్నాడు పైన తువ్వాలు వేసుకొని నరసింహంగారి బట్టలకొట్టు దగ్గరికి వెళ్లాడు కిష్టయ్య.

నరసింహంగారు విభూతి పెండెకట్లు సుదీర్ఘంగా పెట్టేసి పద్దుల పుస్తకంలో మునిగిపోయి వున్నారు కవుంటరు దగ్గర. చెవిలో యథాప్రకారం తులిశాకు పచ్చగా తొంగి చూస్తోంది. వజ్రప్పొడి వేసిన చిటికెనవేలి ఉంగరంలో, సీలింగుఫాను కింద, వెలుగునీడలు దోబూచులాడుతున్నాయి. చెవులకున్న వొంటిరాళ్ల దుద్దులు, ఆయన తలకదిపినప్పుడల్లా నక్షత్రాలల్లే మిలమిల మెరుస్తున్నాయి.

మందపాటి కళ్లద్దాల పైఅంచులమీదనించి షాపులోకివస్తున్న వాళ్లని కనిపెడుతూనే ఉన్నాడాయన. పక్కని గుమాస్తాలమీద ఓరకంట అజమాయిషీ చేస్తూనే ఉన్నాడాయన.

తూర్పుదిశగా, గోడలో అమర్చిన పింగాణీ కూర్పు మందిరంలో, లక్ష్మీదేవి పాలరాతి విగ్రహం, అగరువత్తుల ధూపంలో, ధవళకాంతులతో నిగనిగలాడుతోంది.

విష్ణు విగ్రహం ఆ దరిమేనా ఎక్కడైనా వున్నదా అని వెతుకుతున్నాడు కిష్టుడు. ఎక్కడా లేదు. ఆయన దేవేరి లక్ష్మీదేవికే అక్కడ పెద్దపీట అని స్ఫురణకొచ్చింది చటుక్కున.

ఆ దేవి రవ్వల వడ్డాణమూ, మెడలో మణిమాలా పసిడివెలుగులు చెరిగిపోస్తున్నాయి. ఆమె నవ్వులపాలమీగడలు గదంతా పారాడుతో అమాంతం పుస్తకాలలోకి తొంగి చూస్తున్నాయి...క్యాష్‌బాక్సులో గలగలలుగా మారుతున్నాయి.

గుమాస్తాలు వచ్చినవాళ్లని వరుసగా కూచోబెట్టి, తానులు విప్పి, ముందు కుప్పగా వేస్తున్నారు—తమ వాకచక్యాన్ని లాభాలుగా మార్చి—యజమాని జేబులోకి కనపడని తూరలంట పగడ్బందీగా వొంపేస్తున్నారు.

ఎద్దులు పోటుపడుతున్నాయి: గుర్రాలు గుగ్గిళ్లు తింటున్నాయి.

బీరువాలలో సిల్కులు—టెరిలిన్లు — టెర్రీ కాటన్లు—చీటీ గుడ్డలు—నేతవరుకులు—వడతలకింద ఆ తరవాత ముక్కలుముక్కలుగా గుడిసెలలోకి కొన్నీ, మేడలోకి కొన్నీ, మిద్దెలలోకి కొన్నీ సరఫరా కావాలిసి వున్నా — అంతకా—విడివిడిగా — అరలలో మిడుతూ మిడుతూ—ఒకదాని సరసన వొకటి—కాస్సేపు సామ్యవాదం పాటిస్తున్నాయి.

నరసింహంగారు కిష్టయ్యని చూచారు.

కిష్టయ్యని మాత్రమేమిటి—ఆ ఆవరణలో వున్న అందరిమీదా ఆయన కన్ను పహారా ఇస్తోనేవున్నది అనటం నిజం.

అయితే, ఎవరిని సూటిగా చూడాల్నో, చూచీచూడనట్టు ఎవరిని వొదలాల్నో, అసలు చూడనే లేదన్నట్టు ఎవరిపట్ల అభినయించాల్నో—అదంతా ఆయనకి హస్తకవిలె.

నరసింహంగారు కిష్టణ్ణి చూచివుండకపోతే, ఆయన నరసింహంగారేకాదు!

ఆయనా కర్ణాకర్ణిగా విన్నాడు, కిష్టయ్య అప్పులవేటలో ఉన్నాడని.

అక్కడి కెందుకొచ్చాడో, అతగాడు గుమ్మంలో అడుగు పెట్టగానే గ్రాహ్యమయి పోయిందాయనకి: క్షణం అతనికి సమాధానం ఏమి ఇవ్వాల్నో నిర్ణయించుకోవడమూ జరిగిపోయింది.

ఇలాంటి చిల్లరమల్లర లావాదేవీలలో తల బద్దలు కొట్టుకునే అలవాటు లేదు నరసింహంగారికి: ఆ సందర్భాలలో మెరుపు మెరిసినట్టూ, పాము పడగవిప్పినట్టూ, కొరడా ఛెళ్లుమన్నట్టూ ఆయన బుర్ర గబాల్న ఒక నిర్ణయాని కొచ్చేస్తుందంతే.

డిప్టీ కలెక్టరుగారి కారాగింది బైట. వారి సతీమణిని ఆహ్వానించేందుకు పద్దుల పుస్తకాలు ఎక్కడివక్కడ వొదిలేసి, చిరునవ్వులు గిలకరిస్తూ అలగం దొక్కేస్తున్నారు నరసింహంగారు. పరధ్యాన్నంగా ఉన్నట్టు కనిపించిన గుమాస్తా నారాయణ్ణి

ఒక్క కసురు కసిరారు. 'వారికేమి కావాల్నో కనుక్కోరమ్మ'న్నట్టు అరుగు పట్టుచీరల దగ్గర పాడవుడిగా వున్న అంజయ్యకి కన్నుగీటారు.

ఆయన తనవంక పరాకుగానైనా చూస్తాడేమో అన ఫోజుచ వెళ్ళబోద్దామని రెడీగా నిల్చున్నాడు కిష్టుడు; పక్కపక్కల్ని పైదొలగి నిలుచున్నట్టయినా—తనని అసలు పట్టించుకోకనే పోవచ్చునని పించి...వచ్చిన దగ్గర్నుంచి...ఆయన ఎదటే...దేరా మేకల్లే టంచన్‌గా నిలుచున్నాడు; కాస్త నిరామంగా చిక్కగానే...దగ్గరకి జరిగి...గొంతు సవరించుకుని...చిన్నదగ్గుదగ్గి...ఆయన దృష్టిని ఆకర్షిద్దామని మల్లగుల్లాలు పడిపోతున్నాడు; కంచాలు కడిగే ముందు మెతుకెప్పుడు నేలమీద రాలుతుందా అని ఆసక్తిగా ఎదురుచూచే కాకిచూపు పడిపోయిందతగాడికి.

అసలు, కిష్టాయి వచ్చినట్టు ఆయనకి తెలియకపోతే కదా—తెలియకపోతే, తెలియజెప్పడం అతి సులభం; కాని తెలిసీ తెలియనట్టు అభినయించే పెద్దమనిషికి తెలియజెప్పడం ఎంత కష్టమో కిష్టయ్య కింకా తెలిసిరాలేదు.

అక్కడికీ—తలకి చుట్టుకున్న గళ్ళరుమాలు విప్పి భుజమ్మీద వేసుకున్నాడు కిష్టాయి. అలా—చాలీచాలని రుమాలు చుట్టుకోవడం—దాని అంచులు కుచ్చుతురాయల్లే పైకి వేళ్ళాడ్డం—రౌడీ లక్షణాలని నరసింహంగారి అభిప్రాయం.

ఆ మాటకొస్తే...నరసింహంగారికి విచిత్రమైన అభిప్రాయాలున్నాయి...కొన్ని పోకిళ్ళు ఆయనకి సుతరామూ నచ్చవు. అందులో ఇదొకటి.

ఇదివరలో ఆయనకి నచ్చుబాటుకాని కొక్కిరాయిచేష్టలేవో తెలుసుకుని, పదిగట్టుకొని అవే చెయ్యడంలో కిష్టాయికి కొంత సరదా ఉండేది. కాని, ప్రస్తుతం కార్యార్థిగా వచ్చాడు. కాస్సేపు ఆడ్డ వాదాన్ని వొదులుకున్నాడు. ఏ ఎండకా గొడుగు పట్టాలికదా.

ఆయన ధ్యాసంతా 'పెద్దబేరగాళ్ల'మీదనే వుంది; తనా చిన్నబేరగాడయినా కాదాయెను.

షాపులోకివచ్చి ఏమీ కొనకుండా, వట్టిచేతులతో ఎవరైనా నిష్క్రమించడం జరిగిందో, గుమాస్తాలమీద చిటపట లాడుతున్నారు నరసింహంగారు.

అక్కడికీ—గుమాస్తాలు మీటరు రెండు రూపాయిలు చెప్పినప్పుడు, 'అబ్బా, అంత ధరే?' అని ఆశ్చర్యార్థకాలు పలికిన ఆసామీతో, 'మూడు రోజుల క్రితం ఇదే గుడ్డ ఆరున్నర కమ్మాం'మన్నాడని నచ్చజెప్పి, ధరలు పడిపోయి, నిష్కారణంగా రూపాయిన్నర నష్టాని కమ్ముతున్నట్టు మొహంపెట్టి, ఉమ్ములు బిగించేస్తూనే వున్నారు. మీటరు అయిదు రూపాయిల ధర చెప్పిన గుడ్డ నాలుగు రూపాయిలకి ఆసామీ అడిగితే, 'ఆ రకమూ వున్నది,' అని చేతిలో వున్న పేటరన్ వదిలేసి, మరో తాను విప్పిచూపి, ఆ పద్మవ్యూహంలోనించి ఏ వొక్కడూ తప్పించుకు పోకుండా, అన్నివేపులా దిగ్బంధం చేస్తూనే వున్నారు కాయితక్కులా.

అఖరికి ఎలాగైతేనేం నరసింహంగారి కటాక్ష వీక్షణం కిష్టయ్యమీద పడింది.

గుమాస్తా వ్రాసి చేతికిచ్చిన బిల్లేదో సరిచూస్తూ, 'ఏరా కిష్టాయి, ఇలా వచ్చావు — ఏమిటి కథ?' అని ఇష్టంగా అన్నారు నరసింహంగారు. 'హమ్మయ్య-పక్క ఏదోక్క వచ్చా' నసుక్కొని — ఆయన పక్కని గొంతుక్కూచుని—చంకనున్న ఖాతాపుస్తకం తెరిచి వచ్చినపని నివేదించుకున్నాడు కిష్టుడు.

'అయితే, ఖాతాపద్దు మూడువందల చిల్లరా ఇమ్మంటావు?' అని మునివేళ్లతో గడ్డం పుణుక్కున్నారు నరసింహంగారు.

ఆయన ముఖం ప్రసన్నంగా వున్నందుకు, తను దుర్ముహూర్తంలో రానందుకూ తనని తనే ఏక అభినందించుకున్నాడు కిష్టయ్య.

కాని కిష్టాయి పొరబడ్డాడు.

మీటరులో కత్తికి కత్తి దూసి, ఎదురుపీకన నిలిచి, పరపర పీకలు కోసెయ్యడ మెరుగును గాని కిష్టయ్యకి...పక్కదారిగా కొలవలు ముంచే కార్యక్రమాలు సగమెరుక ... ఇక పోతే, నరసింహంగారి లాంటి మోతుబరులు...తొంటచెయ్యిమాపేముందు... ఎంత మర్యాద, ఎంత మన్ననా ప్రదర్శించాలో... అతని ఊహాకందని ఉదాత్తవిషయం.

నరసింహంగారికి రావలసిన బాకీలు రాబట్టుకుందుకు ఆయన స్వయంగా కలగజేసుకోవాలసిన అగత్యంలేదు. ఏ గుమాస్తానో తరిమి, ఒకటికి రెండుసార్లు నిగ్గదీసి, లెక్కించి, అవసరమైతే విసిరేసి మరీ ఒకవంక జమాయించేసుకొంటాడే...ఇంకొకవంక చేయించి...వలకరింపులో గౌరవమూ, మర్యాదా మాటికి మారుపాళ్ళ పాటిస్తూ పొయ్యేందుకు ...బోలెడంత సావకాశం మిగుల్చుకోగల వ్యవహర్త నరసింహంగారు

కాని...ఆయన ఇవ్వాలిసిన చిల్లర బాకీ లుంటాయి...కాఫీ హోటల్ అయ్యరికనీ...పాలవాడికనీ...దర్జీకనీ...కిరాణా వాడకానికనీ...ఇవి...ఆయన ఇచ్చినప్పుడు తీసుకోవలసిందే...అంతేగాని ఎదటబడి అడిగే దమ్ము ఎవరికీ లేవు.

నేటికి...కిష్టాయి...ఒక నమ్మరంతి...ఖాతా పుస్తకం పట్టుకొచ్చి, 'చిల్లర వాడకంకింద మీ రింత బాకీ వున్నారు—ఇస్తారా?' అని పోనీ...ఏదో లోపాయి కారీగా కాదు...పబ్లిగ్గా తనషాపుకొచ్చి—అడుగుతాడా?!

తల కొట్టేసినట్టయింది నరసింహంగారికి.

అన్నం పెడితే అరిగిపోతుంది. పంచెయిస్తే చిరిగిపోతుంది. వాడబెడితే కలకాలమూ ఉంటుంది అనుకున్నాడు నరసింహంగారు.

'సరే...మార్కండేయులూ...నోటు పత్రాలా... జమాలు వేదాం' అన్నాడు చటుక్కున.

'ఏ నోటూ?' నోరువెళ్ళబెట్టాడు కిష్టయ్య.

'మొన్న ఎనిమిది వందలు పట్టుకుపోయావు గదుట్రా—ఆ ప్రామిసరీనోటు...తరవాత తెల్లబోదువు గానిలే.'

కిష్టాయి కర్ణమయింది.

ముందరికాళ్ళకి బంధంవేస్తున్నాడీయన. నోటు మీద జమాలు వేస్తానంటాడు ఖాతా బాకీ మింజా వలె. ఆ మూడు వందలూ కళ్ళ జూడాలని వచ్చాడు తమా...అది, లొక్కం కింద చేతిలో పడితే నేగాని కొట్టు తెరిచేందుకు లేదు. కొట్టు తెరవాలి...కొన్ని అమ్మకాలు సాగాలి...పాయిలో పిల్లి లేవాలి...లేకపోతే కుండలు డింకీలు కొడుతున్నాయింటో...క్లుప్తంగా పరిస్థితి ఏకరువు పెట్టాడు కిష్టయ్య.

బిగబట్టిన బంగారపు కట్టుడుపళ్ళసందుల్లోనించి తెచ్చిపెట్టుకున్న నవ్వుని అంచలమీద బైటికి నెట్టి—

'ఒరే—కిష్టా—మీరేమో నాకు ఎనిమిది వందలివ్వాలి...అవునా?' నేనేమో మీకు మూడువందల చిల్లర ఇవ్వాలి. కరెక్టు...దరహాస్మిద ఇవ్వదే లేవి నేను మీకా, మీరు నాకా? మిలటరీ లెక్కలు కడుతున్నావేమిట్రా?' అని చివాల్న లేచి, జరుగురువని వున్నట్టు, గబగబ లోపలికి చక్కాబోయారు నరసింహంగారు.

మిలిటరీప్రసక్తి రాగానే కిష్టాయికి బుస్సుమని పొంగొచ్చింది కాని తమాయించుకుని, 'పోని...ఇంకో మూడువందలు బదులు కిందనే ఇవ్వు బాబాయ్' అని అడుగుదామని వాలికదాకా వచ్చింది. పంచు చిక్కకనేపోయె.

వెంట రావద్దంటే ఎత్తుకొమ్మని ఏడుస్తున్నట్టుంది తన అవస్థ.

గంటయింది. ఆయన ఊడిపడడు.

పెద్దగుమాస్తా మార్కండేయులున్నాడొక్కడే.

ముసిముసిగా నవ్వుకుంటున్నాడాయన.

రాతికుండలో ఇనపతెడ్డులాంటివాడు మార్కండేయులు. చూచిందమ్మంటే కాల్చివచ్చేరకం.

ఆయనతో చెప్పుకున్నాడు కిష్టాయి — ఖాతా బాకీకి, తన ప్రోనోటుకీ లంకె వెయ్యవద్దని.

ఆయన లోపలికి వెళ్ళి సంప్రదించి వచ్చాడు.

'ఒరే కిష్టా...ప్రోనోటు మీద జమాలు వేస్తేట్ట...నీకు తెలియందేముంది? క్యాష్ కళ్ళజూదామనుకుంటున్నావుగావును...నల్లమేకని బలేయి...కుదరదు...అయినా, నారే నువ్వు ఇవ్వాలిసిన ప్రోనోటు అట్టే పెట్టి, నీకు రావాలిసిన చిల్లరబాకీ ముందుకు నెడితే అయనేమైనా మేధకు డనుకుంటున్నావా? మింగుడుపడే ఘటమేనా ఓ పట్నావ?'...అని కాస్త మందలింపూ, కాస్త హితోక్తీ మిళాయించి, అప్ని

రంగరించిన శూన్యహస్తం అందించి చక్కాబోయాడు మార్కండేయులు.

కిష్టయ్యకి వచ్చినెలక్కాయి గొంతు కడ్డం పడింది.

ఏమో గోల... ఈ తరకాసులన్నీ అతను గణితం వేసుకోలేదు ముందు...కొట్లోనా సరుకులు నిండు కున్నాయి...ఏవో నాలుగు దినుసులో కొని పడేస్తే, కొట్టు మూసిపెట్టకుండా వెళ్ళమార్చుకోవచ్చును అని ఖాతాపద్దు చంకపెట్టుకుని వచ్చాడు...అంతే కాని...చెట్టంత మనిషి...నరసింహంగారంతటి వస్తాదుని...టోకరా వేదామని రాలేదు.

ఇదెట్లాగూ కొరుకుడుపడే వ్యవహారంకాదు అనుకున్నాడు కిష్టయ్య.

అమట్ల రుమాలు తలకి చుట్టుకుని, ఖాతా పుస్తకం చంకపెట్టుకుని తిరుగుమొహం పట్టాడు.

కాళ్లకి చెప్పులు లేవు; వీథిలో అడుగుపెట్ట గానే అరికాళ్లు చుర్రుమన్నాయి. మధ్యాహ్నపు ఎండ మిటమిట లాడుతోంది; నెత్తి చుర్రుమంది... నరసింహంగారిమీద సరేసరి అరికాలిమంట నెత్తి కెక్కింది.

గాడిపొయ్యిలో కట్టెపుల్లలు పేలినట్టు, కడుపులో నకనక లాడుతోంది.

మిలటరీలో వుండగా...నందు దొరికినప్పు డల్లా 'శకపారా' బిస్కట్లు టిన్నుంమీద టిన్నులు కరకరా నమిలేసిన ఘటమేమో...దరిమిలా సరే సరి...సర్వరుగా కాఫీహోటలులో చేరినతరవాత... జీతం తక్కువయినా, నోటికిమాత్రం అనుకోని రాజభోగాలన్నీ అమరిన కారణంగా...ఆకలితో అలమ టించే రోజులు మరీ వెనకబడిపోయి ... కొత్తగా కుంభకర్ణ నిద్రలో కుదుపొచ్చినట్టయి, పొట్టలో ఆత్మారాముడు పొలికేక పెట్టాడు.

కొంపకి చేరుకునేసరికి మధ్యాహ్నం రెండున్న రయింది.

ఇంటిదగ్గర జానకమ్మ తలుపువారగా నిల్చుని ఎదురు చూస్తోంది.

'ప్రొద్దు పొడవలేదు — అదే పోకగా పోతివి— గొంతులో కాఫీనీళ్లయినా పోసుకోలేదు ... ఎక్కడికి వెళ్ళావు కిష్టయ్యా?' అని లోపలికి నడిచింది.

కిష్టయ్య తల వాలేసి వెనకాలే నడిచాడు.

'నరసింహంగారిదగ్గరికి వెళ్లాను వదినా' అని ఉపక్రమించాడు కిష్టుడు.

'తరవాత చెబుదువుగాని లే పద—అన్నం చల్లారి పోతోంది' అని వంటింట్లోకి దారితీసింది జానకమ్మ.

తక్షణం పీటవేసి, మంచినీళ్లు పెట్టి, విస్తట్లో వడ్డించి, 'అన్నన్నా...పొయ్యిలో పేలిగిన్నె ఇగిరిపోయెనే' అని ఖంగారుపడింది. 'వద్దులే వదినా' అని వారించాడు కిష్టుడు.

జరిగిందంతా ఏకరువుపెట్టాడు.

'అయితే ఈ నరసింహంగారు మనల్ని పట్టి పల్లార్చుదామని చూస్తున్నాడే—నేను విన్న భోగట్టాకీ నువ్వు పట్టుకొచ్చిన సమాచారానికీ సరిపోయింది—!' అంటూ మజ్జిగలోకి రుచి వడ్డించింది జానకమ్మ.

'నువ్వు విన్నదేమిటి?' అని మజ్జిగన్నం కలుపు కుంటున్నవాడల్లా మధ్యలో ఆగిపోయాడు కిష్టయ్య.

తాపీగా చెప్పింది జానకమ్మ.

'ప్రొద్దున్న నువ్వటు వెళ్ళగానే పరంధామయ్య పలకరింపుకని వచ్చాడు.'

'పరంధామయ్య ఎవరూ?' కిష్టయ్య జ్ఞాపకం చేసుకుంటున్నాడు.

'ఎరగవూ...ఏవాడో కొట్టూ స్థలమూ తనఖా పెట్టి ఏగా అన్నాయి రెండువేలు పట్టుకొచ్చారు చూడూ...'

'ఓహో...ఆయనా?...పరివతి ఏమంటాడు? తీర్పుమంటాడా...ఇప్పుడు?...'

'అవేవీ లేదనుకో...కాని ఆ పాటు నర సింహంగారి పేర బదలాయించాట్ట ఈ మధ్య... విన్నావా...?'

'నరసింహంగారి పేరవా?' కిష్టుడికి విలువ గుడ్లు పడిపోయాయి కాస్సేపు.

మెతుకులు మునివంట కొరుకుతూ ఆలోచనలో పడ్డాడు.

జానకమ్మ చెప్పుకుపోతున్నది.

'వరంధామయ్యకి అరుగుదుగా ఒక వెయ్యి రూపాయిలు కావాలిసొచ్చి నరసింహంగారి నడిగాట్ట. 'వెయ్యేమిటే ఖర్మ—మూడువే లిస్తాను...ఆ తణఖా నోటు నా పేర బదలాయించు' అన్నాట్ట నరసింహం. అనట్ట వరంధామయ్య ఎగిరి గంతేశాడు. వెయ్యడూ? పారుపడ్డనుకున్నది, కొట్టుకెక్కి రొంత లోకి దిగితేనేగాని పైసలు కాదనుకున్నది...కటిక ముడి విడిపోయినట్టు...కరుకులు చేతిలో పడుతుంటే...సిరిగా మోకాలొడ్డే దెవరూ? 'సరే'నని అసలీ ఫాయిదా అంతేనహో లెక్కగట్టి యావత్తూ చుపాగా చేతిలో వేయించుకొని నోటు బదలాయించేశాట్ట—ఇదీ కథ."

ఇంతకీ ఎందుకంత పనిగట్టుకుని నరసింహం గారు ఆనఖా నోటు తన పేర బదలాయించుకున్నట్టు? నరసింహంగారు తిన్నుత్ను గొయ్య ఎక్కడో అంతు బట్టలేదు గాని, నలుగురవ్వారు మాత్రం పదే పదే మోగింది ఇద్దరి గుండెల్లోనూ.

(సశేషం)



# తెలుగులో పదవిభజన

శ్రీ ఉప్పలపాటి శ్రీరామమూర్తి

సకలచరాచర సృష్టిలో మానవునకు విశిష్టస్థానము నొసంగునది భావము. భావస్పందనము హృదయస్పందనమువలె సజీవ మానవునకు అత్యంతావశ్యకము. భావము వ్యక్తీకరించుటకు తగిన సాధనము భాష. భాషకు స్థితిని కల్పించుటయే లిపి. భాషలో వాక్య మొక ప్రమాణము. కొన్నిపదముల చేరికతో అర్థవంతమగు వాక్య మేర్పడుచున్నది. ఏతన్మూలమున భావవ్యక్తీకరణము జరుగుచున్నది.

భాషలోని పదజాలమును వ్యాకరణము ననుసరించియు, దేశ్యాన్యదేశ్యవిభేదరూపమైన శబ్దవ్యుత్పత్తి ననుసరించియు విభజింపనగును. మొదటి వర్గీకరణము ఆయాభాషల నిర్మాణ విధానమును బట్టియు, రెండవ విధమైనది శబ్ద వ్యుత్పత్తి ననుసరించియు భిన్నముగా నుండును.

భాషలలోని పదవిభజన ఈ క్రిందివిధముగ నడచినది.

సంస్కృతభాషలో యాస్కాచార్యులు 'చత్వారి పదజాతాని, నామాఖ్యాతోపసర్గనిపాతాశ్చ' అని పదజాలమును నాలుగు విధముల విభజించిరి.

'సత్త్వప్రధానాని నామాని'

అన సత్త్వప్రధానములు నామములు. ఉదా: గౌః, అశ్వః, పురుషః, హస్తీ మొదలగునవి.

'భావ ప్రధాన మాఖ్యాతమ్.'

భావ ప్రధానము గాగలది ఆఖ్యాతము. ఉదా: ఆస్తే, శేతే, వ్రజతి, తిష్ఠతి, ఇత్యాదులు.

'అనిర్బద్ధాః ఉపసర్గాః అర్థాత్ నిరాహుః'

అర్థమునుండి నిబద్ధములు కాని వానిని ఉపసర్గలందురు. ఉదా. ప్ర, పరా, అప, సమ్, అను, అవ, నిస్, నిర్, దుస్, దుర్, వి, ఆఙ్, ని, అధి, అపి, అతి, సు, ఉద్, అభి, ప్రతి, పరి, ఉప.

'ఉచ్చావచేషు అర్థేషు నిపతంతి ఇతినిపాతాః'

తత్తదర్థముల యందు నిపతింపబడునవి నిపాతములందురు. ఉదా. అపి ఉపమార్థే, అపి కర్మోప సంగ్రహార్థే, అపి పదపూరణే.

సంస్కృత భాషలోని పదవిభజనమునకు తెలుగులోని పదవిభజనము విలక్షణమై యున్నది. ఆంగ్ల వైయాకరణుల విభజనమును తెనుగు పదవిభజనమునకు విలక్షణము. భాషా నిర్మాణమునుబట్టి పదవిభజనము వేరుగనుండుననుట కుదాహరణము, సంస్కృతములోని ఉపసర్గలు, ఆంగ్లములోని 'Prepositions' తెలుగులో లేవు.

ప్రాకృత వైయాకరణులు వరరుచి, హేమచంద్రాదులు శబ్దవ్యుత్పత్తి దృష్టితో పదవిభజనమును మూఁడు విధములఁ జేసిరి.

1. తత్సమము: కేవలము సంస్కృత పదజాలము.

ఉదా. మణి, గుణ, హాస మొదలగునవి.

2. తద్భవము: సంస్కృత పదములు కొన్ని వికారములతో ప్రాకృతమున తద్భవము లగుచున్నవి.

ఉదా: అజ్జ (> ఆర్య); అగ్గి (> అగ్నిః); ఇత్థీ (> స్త్రీ); ణాకర; వచ్ఛ; వణం.

3. దేశ్యము: ప్రాకృతములలోని దేశ్యములకు సంస్కృతములో మూలపదములు లేవు.

ఉదా: ఉరల్లి; కండోట్టం; ఇవి ద్రావిడ, ముండారి భాషలనుండి సంక్రమించి యుండవచ్చును.

పండిత హరిగోవిందదాస విరచితమైన 'పాఇఅ సద్ద మహణ్ణవో' (ప్రాకృత శబ్ద మహార్ణవము)లో 38,190 పదములు ప్రాకృతములో నున్నట్లు విశదము. అందు 8,000 పదములు రూపాంతర

ములు. మిగిలిన 3,000 లోను హేమచంద్ర విరచిత ప్రాకృత దేశీనామమాలలోని 5,518 దేశ్యపదములు చేరినవి. అనఁగా నూటి కించుమించుగ ఇరువది పదములు దేశ్యములు. స్థూలముగ పరిశీలించిన ప్రాకృతములోని తత్సమములు, తద్భవములు మాత్రమే వ్యక్తపదజాలము.

ప్రాచీనులగు కేతన పెద్దనాదులు ప్రాకృత వైయాకరణుల పదవర్గీకరణమునే అనుసరించిరి. వారి ఉద్దేశ్యములో తెలుగుకూడ ఒక ప్రాకృతము.

'విశ్రుతులు హేమచంద్ర త్రివిక్రమాదు
లొనరఁ జూపిరి ప్రాకృతంబునకుఁ ద్రోవ
నంధ్రభాషయుఁ బ్రాకృతాహ్వయముకాన
వలయుఁ దల్లక్షణంబులు వరుసఁ దెలియ.'[1]

**తత్సమము :**

కేతన సంస్కృతములోనుండి తెలుగును నిరూపించినాడు. ఆంధ్రభాషాభూషణములో 'మును సంస్కృత పదములపైఁ దెనుగు విభక్తులు ఘటించి చేటపడఁగఁ జెప్పిన నది తత్సమ' మనినాడు. ఉదా. వనము, ధనము, పురుషుడు, అబల, వనమాలి మొదలైనవి.

విన్నకోట పెద్దన 'సంస్కృతంబుపైఁ దెనుంగు విభక్తు లునిచేఁబడి పొసంగియుండినవి'[2]. ఉదా. మత్సరము, నీతిమంతుఁడు, వైరము.

గణపవరపు వేంకటపతికవి తన ఆంధ్ర కౌముదిలో కేవలము ఉదాహరణములు మాత్రమే ఒసంగినాడు. ఉదా: అబ్జాక్షుఁడు, గురుఁడు, గురువు, వనము, తరువు మొదలగునవి. పై ఉదాహరణములఁ బట్టి ఈయనగూడ సంస్కృతముపై తెనుగు విభక్తి ప్రత్యయములు చేర్చిన తత్సమములగునను లక్షణము దృష్టిలో నుంచుకొనెనని తలంపనగును.

ఆంధ్రశబ్ద చింతామణికారుఁడు పదవిభజనమును గూర్చి,

'ఆద్యప్రకృతిః ప్రకృతి
శ్చాద్యే ఏషే తయోర్భవే ద్వికృతిః
కేవలం తయోను సర్వ
త్యుభేవ యేయం యథాతథా భాషా'

ప్రాకృతము సంస్కృత జన్యంబైనను సంస్కృతము నందు జేరక వేరుగ నెట్టుల ఆ సంస్కృతము ననుసరించుచున్నదో అట్లు సంస్కృత ప్రాకృత జన్యంబైన యాంధ్రభాష వానిలో చేరక పృథగ్భూతమై వాని ననుసరించుచుండునని భావము.

కనుక తత్సమము సంస్కృత సమము, ప్రాకృతసమము అని ద్వివిధము. రాముఁడు—శంభువు—నది—వనిత ఇత్యాదులు సంస్కృత సమములు. సిరి—రాణి—వంక ఇత్యాదులు ప్రాకృత సమములు.

అప్పకవి చింతామణికారుడుచెప్పినట్లే సంస్కృత ప్రాకృత భాషాద్వయమువఁ దెనుగు పుట్టెన దనినాడు. తత్సమ లక్షణము నీ క్రిందివిధముగ వివరించెను.

'తెనుఁగు విభక్తుల కడపలఁ
దనరారఁగ నిలువ సంస్కృత ప్రాకృతముల్
గనుపట్టుఁ దత్సమములన
వనజాక్షుడు రాముఁడు దనుజవరులకు ననఁగన్.'

బాలవ్యాకరణకర్త 'సంస్కృత ప్రాకృత తుల్యం బగు భాష తత్సమంబు' అనినాడు. ఉదాహరణములుగ- రాముఁడు, విద్య, హరి, హ్రాది—సంస్కృత సమములు; అగ్గి, ఆడి, గారవము, సిరి—ప్రాకృత సమములు ఇచ్చినాడు.

ప్రసిద్ధ నిఘంటువులు: 'ప్రకృతికి విశేషవికారములు లేక ప్రత్యయాదివికారములు కలిగి ప్రయోగింపబడునది తత్సమము (శబ్దరత్నాకరము). 'ఆంధ్ర ప్రత్యయాదులు చేర్పఁబడిన సంస్కృత శబ్దములు తత్సమములు,' అని నుడివిరి. (సూర్యారాయాంధ్ర నిఘంటువు.)

ప్రాకృత వైయాకరణులు నిరూపించిన తత్సమ శబ్ద నిరూపణములో నొక భేదమును గమనింపవలసి యున్నది. ప్రాకృతములోని తత్సమ రూపములలోవలె (ఉదా. హరి, మణి) తెనుఁగున రాముఁడు.

---

1. చూ. కావ్యాలంకార చూడామణి, వ్యాకరణ ప్రకరణము, నవమోల్లాసము, పద్యము 8.

2. కావ్యా. చూడామణి, నవమోల్లాసము. చూ. ప. 12.

సీత, విష్ణువు, లక్ష్మి అనునవికూడ తత్సమములే. తెలుగులో తత్సమములలో పదాంతకార్యములుండిన యుండవచ్చుగాక శబ్దస్వరూపములో మార్పు ఉండదు. శబ్దస్వరూపములో మార్పు వచ్చినవి తద్భవములు.

**తద్భవములు :**

లక్షణమును కేతన ప్రత్యేకించి నుడువకపోయి నను ఉదాహరణములనుబట్టి మనము గ్రహింప వచ్చును. ఉదా. లక్ష్మి—లచ్చి; ఆశ్చర్యము—అచ్చెరువు; బీభత్సుండు—విబ్బచ్చుడు అను నిట్టి వికృతి రూపము లను తద్భవము లనినాఁడు.

పెద్దన 'సదలంక సిద్ధాక్షరములఁ బొదివిన వర్ణములు బలుకఁగ వర్ధిల్లె ప్రాకృతవిభమగునది' అని తద్భవ లక్షణ మొసంగినాడు. ఉదా. యజ్ఞము—జన్నము; భేదము—బిందము, పుస్తకము—పొత్తము; ప్రౌఢ—ప్రోడ.

వేంకటపతికవి ఉదాహరణములు మాత్రమే యొసంగినాడు. ఉదా. ధర్మము—దరమము; శిఖ—సిక; లఘువు—లగువు; ముగ్ధ—ముగుద; దాక్షిణ్యము—దాకిరము; చక్రము—చక్కము; ఢాలు—డాలు.

ఆంధ్ర శబ్దచింతామణి కర్త సంస్కృత ప్రాకృత భాషాద్వయమువలన పుట్టినది తద్భవము అనినాడు. అనగా నీ యాంధ్రభాషలో తద్భవము వర్ణలోప, ఆగమ, ఆదేశ, ప్రత్యయాత్మక వికారము లను యథాసంభవముగఁ బొంది వ్యవహరింపఁ బడు చున్నది. అది సంస్కృతభవము, ప్రాకృతభవము ని ద్వివిధము.

ఉ. చందురుడు, సంద్రము, గోడ—సంస్కృత భవములు.

పవడము, కంచు, సిరి—ఇత్యాదులు ప్రాకృత భవములు.

**అప్పకవి తల్లక్షణము :**

> వఱలు సిద్ధాక్షరములలో వర్ణసమితి
> దూలఁబోఁబల్క వర్ణంబు దొడరుకొనుచు
> సంస్కృత ప్రాకృతాఖ్య భాషాద్వయమున
> మధ్యవించిన తెలుఁగులు తద్భవములు.

ఉదాహరణము లొసంగలేదు.

బాలవ్యాకరణ కర్తయు 'సంస్కృత ప్రాకృత భవంబగు భాష తద్భవంబు' అని సూత్రించినాడు. ఉదా : ఆకాశః—ఆకసము, కుడ్యమ్—గోడ, వేసరః—వేసడము, స్మరః—మరుఁడు, మొదలగునవి సంస్కృత భవములు.

అప్సరాః – అచ్ఛరా> అచ్చర,
స్థూలమ్ – థోరం> తోరము,
విజ్ఞాపనత్ – వణ్ణావ> పనవ,
విష్ణుః – విణ్హు> వెన్నుఁడు మొదలగునవి.

శబ్దరత్నాకరము 'ప్రకృతియందు వర్ణలోపాగ మాదివికారములను బొంది వ్యవహరింపబడునది తద్భవము' అని పేర్కొనినది.

పెద్దన 'ప్రాకృతవిభమగునది' అని ప్రయోగించుటచే తద్భవమునకగు నర్థమును విస్తృత మొనర్చినాడు. కాని తెలుఁగును ఒక ప్రాకృత భేద ముగ కేతన పెద్దనలు గుర్తించిరి.

పై విధములుగ తత్సమ తద్భవ విభజనము జరుగుటచే నొక చిక్కు ఏర్పడినది. అగ్గి, జముఁడు, జతనము, మొదలగు వికృతి రూపములను ఆంధ్ర శబ్దచింతామణి తత్సదనుసరణీయులు ప్రకారము తత్సమములు. కేతన పెద్దనలకన్న భిన్నముగ ఆంధ్ర శబ్ద చింతామణి తత్సంప్రదాయానుసరణీయులు తత్సమము, తద్భవ శబ్దములను సంస్కృత ప్రాకృత ముల రెండిటికిని ఆరోపించుటయే.

**దేశ్యము :**

కేతన 'దేశి తెనుఁగు' పదములని, ఎలుకువ, నెత్తమ్మి, ఎరగలి, ఎవకము, నొసలు. ఇంటి, వేఁట, వెక్కసము, నెమ్మి, మక్కువ, చెచ్చెర, మచ్చిక, కడిమి, కాఱియ మున్నగువానిని ఉదాహరణములుగ నొసంగి, 'దేశ్యంపు తెనుగు'లను వానిక్రింద, తెమ్మెర తేమాని, క్రొమ్మావి, కెంజాయ, కడలి, మిఱియ, తలిరుఁబోఁడి, పనలు, పోటు, చెంత మొదలగు పదముల నొసంగినాడు. దేశితెనుఁగు పదములకును, దేశ్యంపు తెనుఁగు పదములకును ఎక్కువ భేదము కనుపించుట లేదు.

విన్నకోట పెద్దన సహజాంధ్రదేశ్యోద్భవ మని, దేశ్యోద్భవమని రెండు తెలుఁగుల దేశ్యములను వివరించెను. పెద్దన మతమున సహజాంధ్ర దేశ్యోద్భవము అన అచ్చతెనుఁగు. 'ఈ మూఁడు తెలుఁగులలో నేమిట నున్ దొరలకున్న నెల్ల జనులకున్, లో మిగులఁ దేటపడియెడు నా మాటల యచ్చతెనుఁగులన నెగడొందున్.' 'ఈ మూఁడు తెలుఁగులు' అన తత్సమ, తద్భవ, దేశ్యోద్భవములని అతని భావము. సహజాంధ్రదేశ్యోద్భవమునకు 'ఏనుములు, బండులు, ఎద్దులు, ఉప్పు, పప్పు, కొల్లు, అముదము, లాకులు, వేయి, మానె' ఉదాహరణములు.

'శ్రేయములు, బహుదేశావేయములు, తక్కజనము, వెలుఁగనముగలవై, అయా వెంపుల నెపులకుఁ దీయఁములగు పలుకులు దేశ్యములు' అనినాఁడు. పెద్దన మతమున ఇవియే దేశ్యోద్భవములు. ఉదా: వంగడ, మంగడ, పోలము, చొక్కులు, వెన్ను, వావిరి, క్రొన్నెల, రెల్లి, వేనవేలు మొదలగునవి.

వేంకటపతికవి దేశ్యములని వాని కుదాహరణములమాత్రము నొసంగెను. ఉదా. తెంపరి, పొత్తిక, మక్కువ, ఎనకము, పొలపము, విన్నఁదనము, పువ్విక, మూడిద, మెలఁత, యెల్లిదము, నయ్యాటము, సీవిరి, తెమ్మెర, రజ్జ.

అంధ్రశబ్దచింతామణికారుఁడు దేశ్యమును ఆంధ్రదేశ్యము అని, అన్యదేశ్యమని ద్వివిధము అని నుడివినాడు.

పాలు—పెరుగు—తల్లి— తండ్రి —ఇవి ఆంధ్రదేశ్యములు. అన్యదేశ్యము మరల ఆంధ్రవర్ణయుక్తము, అనాంధ్రవర్ణయుక్తము అని రెండు తెలుఁగులు. తావి—మోవి—మేను—కొను ఇత్యాదు లాంధ్ర వర్ణయుక్తములు. శవర—శేవ— ఖావు—ఖాక ఇత్యాదు లనాంధ్రవర యుక్త అన్యదేశ్యములు.

అప్పకవి స్వదేశ విశిష్టమైనది దేశియమని,

'ఏ దేశ మానవులకు
నా దేశము భాష దేశ్యమయ్యె గరుత్మ
త్ప్రాది జన వ్యవహారము
చే దాని నెఱింగి కృతులఁ జెప్పఁగ నొప్పున్',

అని దేశ్యలక్షణమును వివరించినాఁడు.

శుద్ధాంధ్ర దేశ్యములు, అన్యదేశజాంధ్రములని దేశ్యములు రెండు విధములు.

'ఆంధ్రదేశపు పురప్రాయులైన సకల
జనములకును మఱుంగు దేశంబు లేక
తేట తెల్లమిగాఁ జిల్క మాటలెల్ల
నవని శుద్ధాంధ్రదేశ్యంబు లనఁగఁబడును.'

ఉదా : పాలు, పెరుగు, నెయ్యి, వాలాయము, జోలు, ఎక్కిక, దోలి.

'కేవల యాంధ్రులు నానా
దేశంబులయందు నిలిచి తెలుఁగుల తత్త
ద్దేశోక్తులంటఁబలికిన
నా శబ్దము లన్యదేశజాంధ్రము లయ్యెన్.'

ఉదా: జలము, చివ్వ, శయ్యము, పోరు, పవరము, నెలది, ఇంతి, పడతి, చెలి, బోటి, పొలంతి, తొయ్యలి, నాతి, మెలత, మేను, నేవళి, మోవి, గొను, వెన్ను, వావిరి, నెల, తునుక. నెమ్మి, సోయగము, విలువ, తల్లిమి, మున్నగునవి అన్యదేశజాంధ్రములు.

చిన్నయసూరి 'త్రిలింగదేశ వ్యవహార సిద్ధంబగు భాష దేశ్యంబు' అని దేశ్యలక్షణమును నిర్వచించినాడు. దేశ్యములన తెనుగుదేశమునకు స్వతస్సిద్ధమైన దేశియపదజాలము. ఉదా. ఊరు, పేరు, ఇల్లు, ముల్లు, కోట, పేట, మేడ, దూడ, కోఁత, లేఁత, తావి, మోవి మొదలగునవి.

అచ్చతెనుఁగు

కేతన 'ఎల్లవారికిఁ దెలిసెడి పలుకు లచ్చతెనుఁగ'ని నిరూపించినాడు. ఉదా. తల, నెల, నేవళి, గుడి, మడి, పులి, చలి, మఱుఁగూరు, పేరు, బూరుగు, మగవాడు, అలుక మొదలగునవి.

పెద్దన సహజాంధ్రదేశ్యోద్భవము అనఁగా నచ్చతెనుగువని తెలిసికొంటిమి (ఉదా. ఎనుములు, బండులు మొదలగునవి.)

గణపవరపు వేంకటపతికవి తత్సమదేశ్య తద్భవములఁ గలయని తేటమాటగు లచ్చ—తెనుఁగనఁ దగును' అని అచ్చ తెనుఁగు పదముల కుదాహరణములు ఇచ్చినాడు. ఉదా : అలరు, పేరు, ఆనవాలు, బండి, పండు, నవ్వు, రూక, లాకులు, పాకు, బాకు, మేకు,

ఎండ, వెన్నెల, పులి, వెల, మరుగు, గుజ్జము, కొలకు ; మొదలగునవి.

ఆంధ్రశబ్దచింతామణికారుడు వీనిని గుర్తింపలేదు.

అప్పకవి అచ్చ తెనుఁగులు, 'సంస్కృత తత్సమములు దొరలక తద్భవ దేశ్యముల—మూఁటను సంధిలి కేవలాంధ్రములు' అని ప్రత్యేకముగా ఉదాహరణము లీలేదు. మరియు,

> 'తెలుఁగు మెఱుంగులు ప్రాఁదెనుఁ
> గులు తద్భవ దేశ్యములను గూర్చి మృదు పదం
> బులుగాఁగ నచ్చ తెలుఁగులు—
> మెలకువతో జెప్పఁదగు శమీప్రాంతగ్రహా'.
>
> ఉదా. కదలి మొలమోలిచేడియ.

దేశ్యము అనునపుడు కేతన దేశి తెనుఁగు, దేశ్యంపుఁదెనుఁగు పదములని రెండుగా నుడివినాడు. అర్థభేద మంతగ లేకున్నను దేశ్యంపుఁదెను గనుటలో కేతన అన్యదేశ్యముల తలంచి యుండవచ్చునని యూహింపవచ్చును. (ఉదా. కెంజాయ <కెవ్. తమిళము: ఎఱుపు అని అర్థము.)

విన్నకోట పెద్దన దేశ్యములను అచ్చ తెనుగులని అన్యదేశ్యములని రెండు తెఱఁగుల పేర్కొనినాడు. స్పష్టముగ అన్యదేశ్యములను ప్రస్తుతించిన వాడు పెద్దనయే. 'బహుదేశావేయములు', 'ఆయా వెలపుల చెవులకుఁ దీయములగు' అనుటచే మాండలిక భేదములని అర్థమా లేక ప్రాంతీయపు పలుకుబడులు అవియా అని ఒక అభిప్రాయము పొడముచున్నది. (ఉదా: వంగడ, మంగడు, వేసవేలు, వెన్ను మొదలగునవి.)

కేతన దేశిపదములకును వేంకటపతి దేశపదములకును భేదము లేదు. (ఉదా: ఎనకము, మక్కువ, పొత్తిక). పెద్దన సహజాంధ్రదేశ్యోద్భవములు, ఆంధ్రకౌముది అచ్చతెనుగుపదములుఁ [illegible] యున్నవి. ఉదా: బండుబు—బండి, వవ్వ్య, ఎనుములు, గుజ్జము. అచ్చతెనుఁగు విషయమున కేతన, పెద్దన, గణపవరపు వేంకటపతి ఏకమతమువారే. వారి యుదాహరణములలో సామ్యము గోచరించుచున్నది.

| కేతన | పెద్దన | వేంకటపతి కవి |
| --- | --- | --- |
| తల, వెల, వేసవి, పులి, చలి. | ఎనుములు, వవ్వ్య, బండులు. | బండి, వవ్వ్య, పులి, వెల, గుజ్జము |

అప్పకవి విలక్షణము దేశ్య విభజనమునఁ గాననగును. అతఁడొసంగిన శుద్ధాంధ్రములు, ఉదా: పాలు—పెరుగు—నేయి మొదలగునవి, విన్నకోట పెద్దన సహజాంధ్ర దేశ్యోద్భవము (అచ్చతెలుగు) లకు సరి పోవుచున్నవి. అప్పకవి అన్యదేశజాంధ్రములు కేతన అచ్చతెనుగులలోను (వెల, వేసవి), పెద్దన దేశ్యములలోను సమసించుచున్నవి. అనఁగా కేతన మతము లోని అచ్చతెనుఁగు పదములు (వెల మొదలగునవి) అప్పకవికి అన్యదేశ్యజాంధ్రములు. కేతన దేశి, దేశ్యంపు తెనుఁగులు అప్పకవి అన్యదేశ్యములు. ఉదా: ఇంతి, మక్కువ, నెమ్మి, లేమావి, మోవి. పెద్దన మతము లోని బహుదేశావేయములే అప్పకవి అన్యదేశ్యములు. ఉదా. వాసిరి, వెన్ను.

## గ్రామ్యము :

కేతన గ్రామ్యములు : వంచాకుమయ్య, తోపించాకుమయ్య, యెదాలు, మోసేటివారు, రాసేసువారు, యీడేకదా, వంపేరు, పాడేరు, మూసేరు, యిరదాము, కందాము, బొమ్మడు.

పెద్దన: 'ఊసడములు, గోరడములు, గానంబీనరలున్నైన కట్టిడి వలుకుల్ బాసిల్లు గ్రామ్యములవా హోసొకుగ్రాఁ దెగడుచోట నవియును నొవ్వన్'; ఊసలు, వేసలు, వేదాలు, గావడాలు, మొదలగు కారకములు; పాడేము, మూసేము, రాగాస్త్రేము మొదలగు క్రియలు.

గణపవరపు వేంకటపతికవి : 'పురాదాలు దోషిలు, శాస్త్రుడు' ఇత్యాదులు గ్రామ్యములే యను.

చింతామణి కర్త : అవింధ్య గ్రామ్యమనియు, వింధ్యగ్రామ్యమనియు, రెండు విధములనినాడు. ఉదా. కటకంతుడు, ప్రాణగొడ్డము, జీవగిల్లి, కపిలకన్నులు, కపిలగడ్డము — ఇవి అవింధ్య గ్రామ్యములు. వస్తాడు, తెస్తాడు, పోతాడు—వింధ్య గ్రామ్యములు.

అప్పకవి గ్రామ్యలక్షణము: 'చులుకగా గ్రామ్య జనములు పలుకునట్టి, తెనుఁగుమాటలు గ్రామ్యంబు

లవగ బడియె.' ఉదా: వస్తాడాపేరి, పోమ్మంటు తెస్తాడా, గొల్లడు చూస్తాడా, ఇస్తాడా, మున్నగునవి.

గ్రామ్యము లనునవి లక్షణవిరుద్ధములైనవి గాన ప్రయోగానర్హంబులని శాసించినారు చిన్నయ సూరి. 'లక్షణ విరుద్ధంబగు భాష గ్రామ్యంబు.' ఉదా. వస్తాడు, తెస్తాడు, వచ్చేవాడు, తెచ్చేవాడు, మొదలగునవి. ప్రాచీన కవులు కొందఱు తమ గ్రంథములందు గ్రామ్యములను ప్రయోగించిరిగనుక 'ఆర్యవ్యవహారంబుల దృష్టంబు గ్రాహ్యంబు' అని కలకంఠుడు, జీవగఱ్ఱ, కపిలగడ్డము, మున్నగు నుదాహరణములిచ్చెను. గ్రామ్యములలో నింద్యానింద్య గ్రామ్యము లున్నవని, కలకంఠుడు, జీవగఱ్ఱ, ప్రాణగొడ్డము ఇత్యాదు లనింద్యము లని బహుజనపల్లి సీతారామాచార్యుల వారి భావము. కోట పేటలు నిక్కృష్టములని ఆయన అభిప్రాయము. చేతురు, కోతురు నింద్యగ్రామ్యముల క్రింద బాల ప్రౌఢలు నిరూపించినవి.

'లక్షణము లక్ష్యానుసారిగా నుండ లక్షణవిరుద్ధంబగు లక్ష్యము నింద్యమనుట యెట్లని శంకింప బని లేదు. లక్ష్యములు పండితజనవ్యవహారములుగాని పామర జనవ్యవహారములు కావు. ఎక్కడనో ఒక్కచో అసాధారణ లక్షణ విరుద్ధమైన పండితజన వ్యవహారము ప్రయోగ రూఢమై, అనింద్య మగును' అని శబ్దరత్నాకర నిఘంటుకారుని అభిప్రాయము.

అర్వాచీన కాలమున కాల్డ్వెలు ద్రావిడసామ్య వ్యాకరణము ప్రచురితమైన తరువాత పై విభజన ములో దేశ్య శబ్దమునకు నొక నూతన నిర్వచనము అవసరమైనది. తెలుగు తదితర ద్రావిడ భాషలతో నొక కుటుంబమునకుఁ జెందినదని, ఈ భాషలకు సంస్కృతముతోగాని, సంస్కృత ప్రాకృతములతో గాని జన్యజనక సంబంధము ఏమియు లేదని నిరూపితమైనది. కనుక దేశి పదజాలమే తెలుగునకు సహజ స్వత్వమైన పదజాలము అనియు, తక్కినవి ఎరవు తెచ్చుకొనిన పదజాలమని మనము అర్థము చేసి కొనవలెను.

ఆధునిక భాషా శాస్త్రజ్ఞులు ఏ భాషలోనయి నను పదజాలమును రెండు వర్గములుగ వర్గీకరింతురు.

1. ప్రాచీన కాలమునుండియు సహజ పరిణా మములతోఁగూడి ఆ భాషలోనికి వచ్చిన పదజాలము (Inherited Vocabulary).

2. అన్యభాషాజనులతోడి సంపర్కమువలన ఆయా భాషలనుండి ఎరవు తెచ్చికొనఁబడిన పదజాలము (Borrowed Vocabulary).

తెలుఁగుభాష ప్రత్యేక భాషగ నేర్పడిన పిదప (బహుశః క్రీ. శ. 5, 6 శతాబ్దుల కాలమునందు) ఈ భాషకు ప్రాకృతము, సంస్కృతము, కన్నడము, తమిళము, హిందూస్థాని, ఇంగ్లీషు భాషలతో ప్రధానముగ సంపర్కము కలిగి ఆ భాషలనుండి తెలుగులోనికి ఎంతయో పదజాలము ప్రవేశించినది.

ఇట్లు గ్రహింపబడిన పదజాలములో తొలి కాలమున తద్భవరూపముగను, ఆయా భాషలతో పరిచయ మెక్కువైన కొలది తత్సమ రూపములతో పదజాలము వచ్చియుండవచ్చును.

తద్భవములన తెలుగుభాషాధ్వనిసంప్రదాయ ములకు అనుగుణమైన మార్పులతో –వచ్చిచేరిన సంస్కృత ప్రాకృత రూపములనియు, తత్సమములన ఆవాంధ్ర వర్ణములు, వర్ణ సంప్రదాయములతో సహ యథాతథముగ వచ్చిచేరిన రూపములని అర్థము చేసికొనవలెను. తత్సమ శబ్దములలో ధ్వని మార్పులు లేకపోయినను దేశ్యశబ్దముల సామ్యమునుబట్టి పదాంతమున అజంతత్వము, లింగవచనబోధక ప్రత్యయము చేయుటవంటి స్వల్పపరిణామములు కలుగవచ్చును. ఈ విషయమును మనసునం దిడుకొనే తత్సమము అన తెలుగు సమము అని అర్థము నుదువుట సబబుగ నుండునని కొంద రందురు. తత్సమ, తద్భవ శబ్దములకే విశాలార్థము నొసంగినచో అన్యభాషా పదజాలమున ఒక్కొక్క భాషలోను తత్సమ తద్భవ ములను మనము గమనింపవచ్చును.

శాస్త్రీయముగ తెలుగు భాషలో నేటి పద జాలమును దేశ్యపదజాలము (Native Vocabulary) అన్యభాషలనుండి వచ్చిచేరిన పదజాలము (Borrowed Vocabulary) అని రెండు విధముల పేర్కొన వచ్చును.

తమిళ కన్నడముల నుండి మతపరముగను, సంప్రదాయ సిద్ధముగను, నాగరకతాప్రభావమునను

కొంతపదజాలము తెలుగులోనికి చొరవ చేసికొన్నది. తమిళమునుండి, తిరుచూర్ణము, ఆళ్వారు, మణ్ణాడి, వడ, సాంబారు, మొదలగు పదములు తెలుగులో కలిసిపోయినవి. కన్నడమునుండి బేడలు, సంగాతి, సాకు, బిడారు, మొదలగునవి.

హింద్వార్యభాషలలో పురల ప్రాచీన ఇండో ఆర్యను (Old Indo-Aryan), మధ్య ఇండో ఆర్యను (Middle-Indo-Aryan) అని, అర్వాచీన ఇండో ఆర్యను (New-Indo-Aryan) అనియు మూడు భాగములుగ గుర్తింపవగును. ప్రాచీన ఇండో ఆర్యను అనగా సంస్కృత పదజాలము. మధ్య ఇండో ఆర్యను అన ప్రాకృతము. అర్వాచీన ఇండో ఆర్యను భాషలైన హిందీ, మరాఠీ, ఒరియా, ఉర్దూ, పారశీక భాషల నుండి బహుళముగ పదజాలము తెలుగునకు సంక్రమించినది. ఉదా: చెంబా, పంచదార, ఖుష్కు, కచేరి, దస్తావేజు, గుమాస్తా, అమలు, హోళీ, రివాజు, మేజా, కూజా, బాకీ, తగాదా, కూలి మొదలగు వనేశము.

ముండారి భాషలనుండియు కొంతపదజాలము వచ్చినది. మన నిత్య వ్యవహారములోనవి ఇంకను దొరలు చున్నవి. ఉదా. మీనము, పాపి: నిమ్మ, దానిమ్మ, వాగలి, లింగ మున్నగునవి.

యూరోపియను భాషలలో ప్రధానముగ ఆంగ్లము, ఫ్రెంచి, డచ్చి, పోర్చుగీసు భాషలనుండి పదములు తెలుగులోనికి ప్రవేశించినవి. వారు ఆయా కాలములలో రాజ్యపరిపాలనాధికారము వహించుట చేత వారి వారి పదజాలము తెలుగు వ్యవహారము లోనికి విపరీతముగ వచ్చి చేరినది. అన్నింటికన్నను ఇంగ్లీషు భాషనుండి ఎక్కువ పదజాలము వచ్చినది. నిత్య వ్యవహారములో వానికి చలామణి ఎక్కువగ నున్నదనుటలో ఆశ్చర్యము లేదు.

పోర్చుగీసు పదములు అనాస, అలమారు, బొప్పాయి, బిస్కత్తు, మేజా మొదలగునవి.

కప్తాను, ఇస్త్రీ, బొత్తాము, కమీజు, మున్నగు పదములు డచ్చినుండి వచ్చినవి. బీరువా, సబ్బు ఇత్యాదులు ఫ్రెంచినుండి వచ్చినవి.

కనుక తెనుగుభాషలోని నేటి పదజాలము ఈ క్రింది విధముగ విభజింపవచ్చును.



'వేముడు (కాటయవేముడు) తన మామగారైన అనపోత నృపాలుని రాజ్యభోగముల ననుభవించుచు, అతని యేలుబడిలోనుండిన భూమిని పరిరక్షించుచు, అనపోతని తర్వాత అనవేమ మహీపతిని, కుమారగిరి భూపాలుని రాజ్యమునందు నిలిపి, వారి రాజ్యభారమును వహించుచుండెను. వేమభూపాలు డీ విధముగ వెల్లికేరి కుల సంజాతులైన ప్రభువుల నుద్ధరించుచు, ప్రభు భృత్యుడను ప్రఖ్యాతిని వహించెను.'

పై వివరణమునుబట్టి కాటయవేముడు అనపోతా రెడ్డిపాలనకాలమునుండియు రాజకీయములలో గొప్ప పాత్రవహించు వయస్సులో నున్నట్లు సుస్పష్టము.

ఇక కాటయవేముని మరణ మెప్పుడో చూతము.

పలివెల కొప్పేశ్వరస్వామి ఆలయములోని శ. స 1338 (క్రీ. శ. 1446) నాటి అల్లాడ రెడ్డి అడపం పెద్దన వ్రాయించిన శాసనములో[2] కాటయ వేముని మరణమును గురించి చెప్పబడెను. అది

'గతే దివం కాటయవేమభూపే
నిర్మూల్య తద్ద్రోహికులం సమస్తం
అచంచలశ్రీక మహో తనోతి
తత్పుంశలే రాజ్య మలా త్యద్ధుమ్యః.

రెడ్డిరాజ్య చరిత్ర పరికించిన, కొమరగిరి రెడ్డి మరణానంతరము పెదకోమటి వేమారెడ్డి కొండ వీటి రాజ్యమును వశపరచుకొని రాజమహేంద్రవర రాజ్యమును తన స్వాధీనములోనికి తెచ్చుకొనుటకు కాటయ వేమాదుల విరోధియగు అన్నదేవచోడునితో చేతులు కలిపి యుద్ధములుచేయు సందర్భములో పెద కోమటి వేమారెడ్డి మహాపదవీ సామంతులైన కొప్పు నూళ్ల గోత్రులైన గజరావు వంశోద్భవులైన తిప్పా రావు చేతిలో కాటయవేముడు చంపబడినట్లు అతడు చెప్పుకొనిన 'కాటయవేముని తల గొండగొడ' యను బిరుదునుబట్టి తెలియుచున్నది.[3]

కొండవీటిరెడ్డి రాజులచరిత్రకారులు నిర్ధారించిన వారి రాజ్యకాల పరిమితులు.

| | | | |
|---|---|---|---|
| అనపోతారెడ్డి | క్రీ. శ. | 1353–64 | 12 సం. |
| అనవేమారెడ్డి | ,, | 1364–86 | 23 సం. |
| కుమారగిరిరెడ్డి | ,, | 1386–1402 | 17 సం. |
| | | మొత్తం. | 52 సం. |

పైన నేను చూపినట్లు అనపోతారెడ్డి రాజ్య కాలాంతమునకు కాటయవేముడు 23 సం. వయస్సు వాడైన అతను దాదాపు క్రీ. శ. 1341 ప్రాంత ములో జన్మించి 1416 లో మరణించిన, అతడు దాదాపు 75 సం. జీవించి ఆ వయస్సులోగూడ యుద్ధములు చేయుశక్తిగలవాడని నిర్ధారించవచ్చును.

## రెండవ సమస్య : కాటయవేముని భార్య లెందరు ?

పై వాంశములనుబట్టి అనపోతారెడ్డి రాజ్య ప్రారంభకాలము అనగా క్రీ. శ. 1353 నుండి 1416 వరకునున్న మధ్యకాలమంతయు కాటయ వేముడు జీవించి యున్నట్లు తెలియును. అనపోతా రెడ్డి తన చివర సంవత్సర కాలమునాటి రాజకీయ పరిస్థితు లవగాహన చేసుకొని తన తర్వాత, పిన్న వాడైన తన కుమారుడగు కొమారగిరిరెడ్డిని రాజ్య మందుంచి అతని పరిపాలన నిరభ్యంతరముగా సాగిం చుటకు కాటయవేమునివంటి రాజకీయ ధురంధరుని సహాయ్యమవసరమని తలంచి తన కూతురైన అన్న మాంబను కాటయవేమునకిచ్చి వివాహముజేసి యుండును. అందువల్ల అన్నమాంబ కాటయవేముని పట్టపు దేవేరియని చెప్పవచ్చును.

అన్నవరం దానశాసనములో చెప్పబడిన కుమార గిరిరెడ్డి సోదరి (కవలలుగా బుట్టినందువల్ల అతని సమవయస్కురాలైన) యైన అన్నమాంబ ఈమెయే. ఇది మేనరికము. అందువల్లనే కాటయవేమునికి కుమారగిరిరెడ్డి యందంత భక్తిశ్రద్ధలు.

---

2. ద. హి. శా. సంపుటము 5. నంబరు 113. (పలివెల శాసనము)

3. Macanzee MSS. Nos. 15–6–32, 15–4–3 (బిరుదావళులు)

ఈ మొగాక రెడ్డిరాజ్యచరిత్రకారులచే, విమర్శకులు కాటయవేముని భార్యలుగా నిర్ధారింపబడినవారు ఇంకను నల్గురు కలరు. వారు (1) తల్లాంబిక (2) మల్లాంబిక (3) దొడ్డాంబిక (4) హరిహరాంబ. శాసనాధారములవలన వీరిలో ఎంతమంది కాటయవేముని భార్యలో నిర్ధారింప ప్రయత్నింతును.

శ. వ. 1333 (1411 క్రీ. శ.) నాటి తొత్తరపూడి శాసనములో[4]

'సోయం వేమమహీపతి ర్విజయతే
కాటావనీశాత్మజః
అథాత్కాటయవేమన్య
జాయా మల్లాంబికా సతీ
అశేషగుణ సంపూర్ణా
పాతివ్రత్యధురంధరా'

అను దానినిబట్టి మల్లాంబయను నామె కాటయవేముని భార్యగా ధృవపడినది. ఈమెయే శ్రీ గౌతమీతీరమందు మార్కండేశ్వర దేవరకు పహిండి గుడికట్టించి నిత్య అవసరలకు మల్లవరమను గ్రామమును దానము జేసెను. శ. వ. 1330 (క్రీ. శ. 1408) నాటి పెద్దాపురం తాలూకా తిరుపతి గ్రామములోని శృంగారరాయస్వామివారి యాలయ మండపమునందున్న శాసనమునుబట్టి ఈమె కన్నిబరాయ కూతురనియు, ముక్కంటిరాజా సోదరియనియు తెలియుచున్నది.

శ. వ. 1332 (క్రీ. శ. 1410) నాటి అహోబల శాసనమునుబట్టి కాటయవేమునకు తల్లి సానమ్మయను భార్యయున్నదనియు, ఆమె తన కుమారుడగు కొమరగిరిరెడ్డికిన్ని తనభర్తయగు కాటమ రెడ్డికిన్ని సుకృతమునకుగాను తల్లవీర్యగామమును దానమిచ్చినట్లు చెప్పబడెను.

ఇక దొడ్డాంబిక విషయము.

దొడ్డాంబిక కాటయవేముని భార్యయని అనితల్లి కలువచేరు[7] శాసనమందు చెప్పిన

'యస్యావేమనృపాలో జనకో
దొడ్డాంబికాతు జనయిత్రీ
సాదివ్యత్యానితల్లి
నమూర్తిరివదేవభూమిదేవశ్రీ'

(42 శ్లోకము)

అను దానినిబట్టి రెడ్డిరాజుల చరిత్రకారులు, శాసన విమర్శకులు కాటయవేమునికి దొడ్డాంబికయను భార్య కలదని గ్రంథస్థము చేసిరి. పై శ్లోకమునకు వారు చెప్పిన అర్థము 'ఎవతెకు వేమనృపాలుడు తండ్రియో, దొడ్డాంబిక తల్లియో ఆ అనితల్లి ఆకృతి దాల్చిన దేవభూదేవలక్ష్మివలె తేజరిల్లుచున్నది. కాని కొన్ని నిదానముగా ఆలోచించిన ఇది సరియైన అర్థము కాదని నా దృఢవిశ్వాసము. నా అభిప్రాయములో దాని అర్థ మిట్లుండవలెను. 'ఎవతెకు దొడ్డాంబిక తల్లియో, యట్టి కాటయవేముడు జనకుడుగాగం యనితల్లి ఆకృతి దాల్చిన దేవభూదేవలక్ష్మివలె తేజరిల్లుచున్నది.' ఆ శాసనరచయిత అభిప్రాయము కూడ నదేయని నా తలంపు. ఈ న్యాయాహ సరియైనదని చెప్పుటకు రెండు బలవత్తరములైన సాక్ష్యములు గూడ గలవు. అవి (1) నెమకటి శతాబ్దములలో రాజుల భార్యలు తమ పేరిట అగ్రహార దానములు జేసి శాసనములు వ్రాయించుకొను పరిపాటి, స్వతంత్రత గలదు. అట్టివాటి కెన్నో ఉదాహరణలు చూపవచ్చును. కాటయవేముడు, అతని భార్యలుగూడ ఆ పద్ధతిలోనే గ్రామదానములు జేసి శాసనములు వ్రాయించిరి. అట్టివన్నియు ఒకచో చేర్చి కొమరగిరి మండలమను పేరులో కాటయవేముడు శ. వ. 1332 (క్రీ. శ. 1410) నాటి అహోబల శాసనములో చూపినాడు. 'స్వస్తిశ్రీ శక

---

4. S. I. I. Vol X. No. 557 (తొత్తరపూడి శాసనము)

5. ద. హి. శా. సంపుటము 4 సంఖ్య 103 (తిరుపతి శాసనము)

6. క్రీ. శ. 1410 నాటి అహోబల శాసనము [S. I. I. Vol X. No. 577.]

7. అనితల్లి కలువచేరు శాసనము.

వర్షములు 1332 అగుచేంటి..........కొమరగిరయ్యంగార్కిన్ని, పరమహితుండైన కాటమరెడ్డి వేమారెడ్డి[గా]రు తనకు స్వామి అయిన కొమరగిరయ్యంగార్కిన్ని వారి దేవులైన అమ్మంగారులకున్ను అక్షయసుకృతముగాను దేవర్లకున్ను, బ్రాహ్మలకున్ను ధార వోసి ఇచ్చిన కొమరగిరి మండలము..........' అని ప్రారంభించి 47 గ్రామములేగాని, అతడు, అతని దేవేరులు విడివిడిగా ధారవోసి ఇచ్చిన 9 గ్రామములేగాని దొడ్డాంబిక ఇచ్చిన గ్రామముగాని, హరిహరాంబ ఇచ్చిన గ్రామముగాని పేర్కొనబడలేదు. [ఉదాహరణకు..అకులం... పెద్దిభట్లవారి మా[రిమండ్డ మారవర]...[కాట]మరెడ్డి వేంవరము; దేవణ్ణయంగారి ప్రతాపఅన్నవరం; శ్రీ గౌతమీతీరమందుననేదాద్రి శ్రీ నరసింహ్వాదేవరకు......ధారవోసి సమర్పణ చేసిన వెలుమూరి తల్లవరం; కాటమరెడ్డి వేమారెడ్డింగారి అర్ధాంగిలక్ష్మి అయిన మల్లసానంగారు... మార్కండేశ్వరదేవరకు నిత్యలవనరాలకు యిచ్చిన మల్లవరం]'. అందువల్ల వీరిద్దరు (దొడ్డాంబిక, హరిహరాంబ,) కాటయవేముని భార్యలు కారని నిర్ధారణగా చెప్పవచ్చును.

ఈ సందర్భములో తురగా కృష్ణమూర్తిగారు తమ వ్యాసములో (ఫిబ్రవరి 1963, భారతి పుటలు 53, 54) దొడ్డాంబిక కాటయవేముని భార్యయని చూపు సందర్భములో వ్రాసిన వ్రాత చూడుడు. 'కుమారగిరి సోదరీలుగా జెప్పుకొనదగు 'అన్యమ' 'దొడ్డాంబిక'ల ప్రసక్తి ప్రస్తుత అన్నవరదాన శాసనములోను, అనితల్లి కలువచేరు శాసనములోను తప్ప యితర యేవిధములగు శాసనములందుగాని గ్రంథములందుగాని గానబడుటలేదు' అని ప్రారంభించి, 'కాటయవేముడు దివంగతుడైన 8 లేక 10 సంవత్సరముల తర్వాత 'అనితల్లి' కలువచేరు శాసన మీయబడినది. ఈ శాసనములోనే 'అనితల్లి' జననీ, కాటయవేముని భార్య 'దొడ్డాంబిక' ప్రసక్తి తొలిసారిగా కానవచ్చుచున్నది. ఇంతవరకట్టి సమాచార మేశాసనమునందునుగూడ మన కందజేయబడలేదు. అందుచే కాటయవేముడు రాజమహేంద్రవర రాజ్యమునకు కుమారగిరి తనయుడు అనవోతారెడ్డికి రక్షకుడుగా, మంత్రిగా, సేనాధిపతిగా వెడలునాటికి కుమారగిరి సోదరి 'అన్యమ' నుద్వాహమైయుండి, యామెతో గూడ రాజమహేంద్రవర రాజ్యమున కేగి, యట దాంపత్య జీవనము నెరపుచు నుండియుండవచ్చును. ఆ తరువాత గొంతకాలమునకు 'అన్యమ' గతించుటచే [పాపము శమించుగాక!] కాటయవేముడు కుమారగిరి మరొక సోదరియగు 'దొడ్డాంబిక'ను పరిణయమాడి యుండవచ్చును' అని వ్రాసి 'అన్యమ' 'దొడ్డాంబిక'లు భిన్నవ్యక్తులనియు, ఇద్దరు అనవోతారెడ్డి కూతుళ్లు, కాగా అన్నమ పెద్దదనియు దొడ్డాంబిక చిన్నదనియు చూపి వారిద్దరు ఒకరి తర్వాత ఒకరు కాటయవేముని వివాహమాడిరనియు నిరూపించిరి. కృష్ణమూర్తిగారు పై విధముగా నిర్ణయించు ప్రయత్నములో ఒక విషయములో భ్రమ, ప్రమాదములకు లోనైరి. అన్నవర దానశాసనములో చూపినట్లు కుమారగిరి రెడ్డి, అన్యమాంబలు కవలలుగదా! అందువల్లవారు సమవయస్కులుగదా! అనవోతారెడ్డి మరణకాలమునాటికి కుమారగిరిరెడ్డి పిన్నవయస్సు వాడగుటవలన అనవోతారెడ్డి తర్వాత అతని తమ్ముడు అనవేమారెడ్డి రాజ్యమునకువచ్చెను. కాబట్టి అనవోతారెడ్డి మరణమునాటికి కుమారగిరిరెడ్డికి 15 సం. వయస్సని తలంచిన అతని మరణ కాలమునాటికి అనగా క్రీ. శ. 1402 నాటికి అతడు దాదాపు 55 సం. వయస్సువాడగును. కాబట్టి అప్పటికి అన్యమగూడ 55 సం. వయస్సుగలదై యుండును. అనవోతారెడ్డి క్రీ. శ. 1364 లో మరణించెను. అప్పటికి ఏ వాల్గు సంవత్సరములకు పూర్వమో దొడ్డాంబిక పుట్టినదనుకొన్నను క్రీ. శ. 1402 నాటికే 42 సంవత్సరముల వయస్సుగలదై అప్పటివరకు వివాహముకాకుండ బ్రహ్మచారిణిగానుండి క్రీ. శ. 1402 తర్వాత కాటయవేముని వివాహమాడినదనుట ఎంత ప్రయత్నించినను నమ్ముటకు వీలులేని విషయము. అందులోను ఆమె రాజకుటుంబములోపుట్టి 42 సం. అవివాహితగానుండుట అసంభవము. కాబట్టి అనవోతారెడ్డికి 'దొడ్డాంబిక' యను కూతురులేదు. కాటయ

వేముని భార్యలలో ఆమె ఒకతెకాదు. దొడ్డాంబిక యను నామె కాటయవేముని భార్యగా దలంచినయెడల అన్యమ దొడ్డాంబిక లిద్దరు ఏకవ్యక్తులే కాని భిన్నులెన్నటికికారు. శాసనాధారములవలన తెలిసినంత వరకు కాటయవేముల అన్యమాంబల వివాహము పిన్నవయస్సులో జరిగినదే: కాటయవేమారెడ్డి కుమారుడగు కాటయ, హరిహరరాయల కూతురగు విజయలక్ష్మల వివాహము పిన్నవయస్సులో జరిగినదే! అనవోతారెడ్డి కుమారుడగు కుమారగిరిరెడ్డి వివాహము పిన్నవయస్సులో జరిగినదే! కాటయవేముని ఇంకొక కుమారుడగు కుమారగిరిరెడ్డి వివాహము (జరిగినట్లయితే) పిన్నవయస్సులో జరిగినదే! ఇన్ని వివాహములు పిన్నవయస్సులో జరిగినట్లు తెలియుచుండ ఒక్క 'దొడ్డాంబిక' 42 సం. వయస్సుదాకా వివాహము చేసుకొనకుండుట ఏవ్విధముగను నమ్ముటకు వీలు లేనిది. కాబట్టి అనితల్లి కలువచేరు శాసనములో చెప్పిన 'దొడ్డాంబిక' కాటయవేముని భార్యగాక తల్లియై యుండుననుట నిర్వివాదాంశము.

ఇక మిగిలినది హరిహరాంబ.

హరిహరాంబ కాటయవేముని భార్య అనియు, లేదా కూతురనియు లేదా మనుమరాలనియు అర్థములు చెప్పుకొనుటకు దారితీసిన శ్లోకములు : కోరుమిల్లి శాసనములో [8]

'పౌత్రీం కాటయవేమయ క్షితిపతేః
పుత్రీంచ కాటప్రభోః
దౌహిత్రీం చతురర్ణవీం హరిహర
క్షోణీపతేర్భాసితుః
తన్నామ్నా విదితాహ్వయాం హరిహరాంబాం
చారు మగ్రాహయ
ద్భ్రాతా వేమ మహీశ మల్లనృపతి
స్సౌమాభ్య లక్ష్మీ స్వయం॥

ఈని భావము : కాటయవేముని మనుమరాలును, కాటప్రభుని కుమార్తెయు, హరిహరరాయల దౌహిత్రియునగు హరిహరాంబను అల్లయవేమ నృపతి పాణిగ్రహణము గావించెను.

ఇదే అర్థమువచ్చు శ్లోకములు వేర్వేరు కాలములలో వేయించిన అల్లాడ వేమవర శాసనమునందును, అల్లాడ భూపవర శాసనమందును, మొత్తము మూడు శాసనములందును ఒకేవిధముగా నుండెను. (గమనింపదగ్గ ఇంకొక విశేషమేమన ఈ శాసనములు వేర్వేరు గండాచార్యులచే గండరింపబడెను.)

కోరుమిల్లి శాసన పాఠమును యథాతథముగా నామోదించి తొలుత ప్రచురించిన బర్నెటు దొంగారు "The Vemavaram plates of Allayavema which will be mentioned in the next paragraph, refer to Kataprabhu who was the son of Katayavema and who married the daughter of the Vizayanagara King Harihara II [Annual report on Epigraphy 1906 Page 63]' అని వ్రాయుచూ విజయనగర హరిహరరాయల కుమార్తెను కాటయవేముని కుమారుడు కాటప్రభువు పరిణయమాడెనని అభిప్రాయ మిచ్చియున్నారు. కాని శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు కాటయవేమునకు కాటయ యను కుమారుడు లేడని గట్టిగానమ్మి తమ శృంగార శ్రీనాథములో[9] 'పై శ్లోకపాఠములో తప్పు లున్నవనియు, 'పౌత్రీం కాటయవేమయ క్షితిపతేః పుత్రీంచ కాటప్రభోః' యనున దపపాఠమనియు, నద్దానిని సవరించి 'పుత్రీం కాటయవేమయ క్షితిపతేః పౌత్రీం కాటప్రభోః' యని సవరించి 'హరిహరాంబ కాటయవేముని కుమార్తెయు, కాటప్రభుని పౌత్రియు, అల్లయవేమారెడ్డి భార్యయు'నని నిర్ధారించిరి. మల్లంపల్లి సోమశేఖరశర్మగారు[10] ప్రభాకరశాస్త్రిగారి మార్పు నంగీకరించి హరిహరాంబ కాటయవేముని కూతురని నిర్ధారించిరి. హర్షవర్ధనశర్మగారు గూడ నదే అభిప్రాయమును వెలిబుచ్చిరి. మల్లంపల్లి

8. కోరుమిల్లి శాసనము (దీనినే వేమవర శాసనమని గూడనందురు.)

9. శృంగార శ్రీనాథము P. 284. శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి.

10 History of Reddy Kingdoms M.S. Sarma, Chapter VIII, Pages 127-128.

వారు ఇంకొకచోట హరిహరాంబ కాటయవేముని భార్యయని వ్రాసిరి[11]. ఖండవల్లి లక్ష్మీరంజనంగారు బాలేందుశేఖరంగారుగూడ వారి ఆంధ్రుల చరిత్ర–సంస్కృతిలో అట్లే వ్రాసిరి. ఇట్లు భిన్నభిన్న వ్యక్తులు వేరువేరు అభిప్రాయములను వెలిబుచ్చినను కొరుమిల్లి శాసనములోని అసలు పాఠమే సరియైనది. ఇది సత్యమని నిరూపించుటకు ముందు ఏ సందర్భములో హరిహరరాయలు కాటయవేముని స్నేహమునభిలషించెనో చూతము.

మల్లంపల్లి సోమశేఖరశర్మగారు తమ History of the Reddy Kingdoms అను పుస్తకములో 8 వ ప్రకరణములో కుమారగిరి రాజ్యమును గురించి తెల్పు సందర్భములో ఈ క్రింది విధముగా తెల్పిరి

'అనవేమారెడ్డి మరణించగానే కొండవీటిలో అంతర్యుద్ధము (Civil war) ప్రారంభమయ్యెను. ఆ సమయముజూచి విజయనగరరాజగు రెండవ హరిహరరాయలు కొండవీటివిూదికి దాడువెడలి త్రిపురాంతకమువచ్చి దానిని స్వాధీనపరచుకొనెను. అంత యుద్ధము పూర్తికాగానే కొమరగిరిరెడ్డి, తన బావమరదియు, సైన్యాధ్యక్షుడును నగు కాటయవేముని విజయనగరమువారి దండయాత్రను, అరికట్టుటకు పంపెను. శ్రీశైలం త్రిపురాంతకములవరకు చొచ్చుకొనివచ్చిన హరిహరరాయలను కాటయవేముడు ఎదుర్కొ, గార్తిగ ఓడించెను. అందుమీద రెండవ హరిహరరాయలు రెడ్డిరాజులతో స్నేహముగానుండిన తనకు లాభమని కాటయవేమునితో సంధిచేసుకొనెను. దాని ననుసరించి త్రిపురాంతక పరిసరములను రెడ్డిరాజులకు విడిచి శ్రీశైలప్రాంతము తన ఏలుబడిలో నుంచుకొని వారితో స్నేహము బలముగా నుండుటకు తన కుమార్తెయగు హరిహరాంబను కాటయవేమున కిచ్చి వివాహము జేసెను'[12] (ఈ వ్రాతలో చెప్పిన హరిహరాంబ కాటయవేముని భార్య అనునది తప్పు.)

ఈ దండయాత్ర క్రీ. శ 1386-90 మధ్య జరిగినది. కొరుమిల్లి శాసనములో చెప్పిన కాటయ యనువ్యక్తి కాటయవేముని కుమారుడుగా చెప్పుటకు శాసనాధారము గలదు.

గోదావరి మండలములోని సర్పవరమందున్న శా. శ. 1336 (క్రీ. శ. 1414) నాటి శాసనములో[13] కాటయవేమారెడ్డికి కాటయయను కుమారుడు గలడని చెప్పబడెను. ఎడమభాగము గోడలో కట్టబడెను. కుడిభాగము.

సప్త కాటయశౌరేః పౌత్రోమార
స్నపోతవ్యవ గేః జామా
స్వస్తి శకవర్షంబులు
కార్తిక శు 15 భానువారం
శైవ మాచివేనిం గా
రెడ్డింగారి వే
రుక్షైన

| | |
|---|---|
| స్య కాటప్రసునమూనుః పిరా | 1 |
| తా జయతి వేమభూపాలః | 2 |
| 1336 గు నేంటి జయ సంవత్సర | 3 |
| వేమారెడ్డిగారి నిజభృత్యుం | 4 |
| రు తను స్వామియైన కాటమ | 5 |
| మ రెడ్డి (వే) మా రెడ్డింగారి కుమా | 6 |
| కాటమరెడ్డి వేమారెడ్డింగారి | 7 |

[అసంపూర్తి]

11. అదే పుస్తకములో 9 వ ప్రకరణము పుట. 157.

12. ,, ,, 8 వ ప్రకరణములో దీనికి సంబంధించినంతవరకు తెలుగుసేత.

13. శ. స. 1336 నాటి సర్పవరములోని శాసనము (A. R. No. 453 of 1893. (చూడుడు. చాగంటి శేషయ్యగారి కవితరంగిణి. 5 సం. పుట. 98.)

(ఏడమనైపు గోడలో కట్టబడ్డభాగము శ్రీ శేషయ్యగారు అదే రోజున పుట్టిన కడియం మాచినేనిగారి మరొక శాసన సహాయ్యముతో పూరించినట్లు వారు వ్రాసిరి.) దీనినిబట్టి కాటయవేమారెడ్డికి కాటయ యను కుమారుడున్నట్లు స్పష్టముగదా! కాన పై 'శ్రీ............మొదలైన శ్లోకమునకు యథాతథముగా చెప్పిన అర్థమే సరియైనది. పినవెళ్ల తామ్రశాసనములోని 24 వ శ్లోకములోని 'పుత్రీ కాటయవేమభూప తనయ శ్రీ కాటయక్ష్మాపతేః' అను పది కాటయవేమునకు కాటయ యను కొడుకున్నట్లు ప్రత్యక్ష సాక్ష్యము దొరికినదిగదా! అందువలన హరిహారాంబ కాటయవేముని కొడుకు కూతురగును. అప్పుడు కాటయ రెండవ హరిహరరాయల అల్లుడగును. అట్లయిన రెండవ హరిహరరాయల కూతురు పేరేమను సమస్యా పరిష్కారమునకు ప్రయత్నించవలసి యున్నది. ఇప్పటివరకు చరిత్రకారులు విమర్శకులు ఆమె పేరేమో తెలియదనే వ్రాసిరి. కాని ఆమె పేరు ఒక శాసనములో చెప్పబడెను. శ్రీశైలములోని మల్లికార్జున ఆలయమునుండి పాతాళగంగకుబోవు మార్గమున కొన్ని గోకర్ణకదంబుల శాసనములు గలవు. అందులో క్రీ. శ. 1393 నాటి తెలుగు అక్షరములతో చెక్కబడిన గోకర్ణ కదంబుల సంస్కృత భాషా శాసనమొకటి కలదు.[14] విస్తరభీతిచే శాసన శ్లోకములన్నియు వదలి 14 నుండి 20 వరకు చూపుచున్నాను.

"గోకర్ణేశ్వర సత్పుత్రా
సఫలాత్మ మనోరథా
సౌభాగ్య గుణసంపన్నాం-
విఠ్ఠలాంబా మసూత సా
కృతహంస గమనశిక్షా
కదంబకుల విభవ భాగ్య సంభూతిః
వికసిత సుమనోభావా
విఠ్ఠలాదేవీ విభాతి ఘనలక్ష్మీః
క్షితిరివ విఠ్ఠలాదేవీ
హరిహరభూపేన కృతకరగ్రహణా
ధర్మానమమభిషిక్తా
శ్రీకరవాలా ప్రసాదితా జయతి
ఖ్యాతి ప్రభవాచ హారే వ్రతి
హరస్యాపి వల్లభా జాతా
ఖ్యాతి ప్రభవాచనతీ
విఠ్ఠలదేవీతి హరిహరస్యైకా
సత్యం సరస్వతీ తస్యాః
పాతివ్రత్య మరున్ధతీ
ఔదార్యం విఠ్ఠలాంబాయాః
శీలయ స్త్యమరద్రుమాః
సర్వ్యస్తే విఠ్ఠలాంబాయాః
ఉన లోకోత్తరా గుణాః
కాంక్షతిస్మ న్వయం లక్ష్మీ
జన్మ యస్యాం జగత్రయా
ఉదపాది విజయలక్ష్మీ
హరిహర భూపేన విఠ్ఠలాంబాయామ్
హైమవతీవ హిమవతామేనాయా
మఖిలలోక మాన్యాయామ్"

దీనిలోని విషయము.

గోకర్ణ కదంబుల రాజగు కామదేవుని కూతురు పద్మలాదేవి. ఈమె చాళుక్య రాజేంద్రుని భార్య. వీరికి జన్మించిన విఠ్ఠలాంబయను నామె విజయనగరరాజగు హరిహరరాయల భార్య. విఠ్ఠలాంబయందు హరిహరరాయలకు విజయలక్ష్మియను కుమార్తెయు, విరూపాక్షుడను కుమారుడును కలిగిరి. [ఇంతవరకు ప్రచురించిన విజయనగరరాజుల శాసనములనుబట్టి హరిహరరాయలుకు విజయలక్ష్మియను నొకర్తె మాత్రమే కుమార్తె గలదని తెలియును.]

ఈ శాసనము శ. స. 1315 నాటిది. అనగా కాటయవేముడు హరిహరరాయలకు శ్రీశైల ప్రాంతము స్వాధీనము చేసిన మూడు సంవత్సరముల

14. Annual Reports on Epigraphy—Bombay, Karnataka No. 51 of 1915, No. 110 of 39-40.

తర్వాతది. కాబట్టి కోరుమిల్లి శాసనములో చూపిన కాటయ వేమారెడ్డి కుమారుడు కాటయ భార్యయే ఈ విజయలక్ష్మి. వీరి సంతానమే హరిహరాంబ. కాబట్టి ఇదివరకు చరిత్రకారులు, విమర్శకులు తలంచినట్లు హరిహరాంబ కాటయవేమారెడ్డి భార్యకాదు, కూతురుకాదు, కోడలు కాదుకాని మనుమరాలు. అల్లయ వేమారెడ్డి భార్య.

సారంశమేమన

కవిసార్వభౌముడగు శ్రీనాథునిచే మనుతుల్యుడని పొగడబడిన కాటయవేమునకు అన్నమాంబ, తల్లాంబ, మల్లాంబ యను ముగ్గురుభార్యలు, కాటయ, కొమరగిరి యను ఇద్దరు కుమారులు, అనితల్లియను నొకకూతురు, హరిహరాంబయను నొక మనుమరాలును వుండిరి.

ఇంకొక విషయము; అనవోతారెడ్డి తన తర్వాత చిన్నవాడైన తన కుమారుడగు కుమారగిరిరెడ్డి రాజ్యమునకు వచ్చుటకు బలవంతుడు, శక్తిసామర్థ్యములుగల కాటయవేముడు సహాయ్యపడునని తలంపుతో తన కుమార్తెయగు అన్నమాంబనిచ్చి వివాహము చేసినట్లే క్రీ. శ. 1416 ప్రాంతములో మరణించిన కాటయవేమారెడ్డి చిన్నవాడైన తన కుమారుడగు –కొమరగిరిరెడ్డి తన తర్వాత రాజ్యమునకు వచ్చుటకు శూరుడు తన సైన్యాధ్యక్షుడైన అలాడరెడ్డి, అతని భ్రాతులు తోడ్పడుదురను సద్దేశ్యముతో తన కూతురగు అనితల్లిని వీరభద్రారెడ్డికిచ్చి వివాహము చేసెనని తలంపవచ్చును.

కాటయవేముడు (క్రీ. శ. 1341 – 1416)



# అగ్ని స్తుతి

శ్రీ బెల్లంకొండ సూర్యప్రకాశరావు

[ఆంధ్ర మహాభారతములోని యాదిపర్వము షష్ఠాశ్వాసములోని యౌర్వోపాఖ్యానము. రాజా కృతవీర్యుని తనయులచే ఖండితులైన తన పితృదేవుల దలచి, ఆ రాజుల యన్యాయము నెదిరింపని ప్రజల యధర్మ ప్రవృత్తిని దలచి, సర్వలోకప్రళయార్థముగా ఔర్వుడు తన తపోశక్తిచే బాడబాగ్నిని సృజించెను. ఆ మహాగ్ని నౌర్వు డిట్లు స్తుతించెను.]

"జ్వలితజ్వాలల సర్వలోకముల నీ సత్యమ్ముతో నిల్పు మి
న్నుల జన్మించిన దేవదేవ! కరుణా న్యూనత్వ మీ లోక మం
దలి దుష్కృత్యము గాల్ప నే దపముతో దావాగ్నిగా గోరెదన్
విలయత్కాల మహాగ్నిరూప! యిటు రావే! యావహింపంగదే!

వాలో నగ్నికి పూజసేసితి దురన్యాయమ్ములన్ ద్రుంగ; వ
ధీలాగ్నిచ్ఛట లేచు విస్తరిలి సంప్రీతిన్ జగమ్మున్ లయో
ద్వేలోద్గ్రోష్మహతమ్ముగా సలుప నే వెల్గింతు జీవాత్మ. నీ
జ్వాలల్ జేర్చుచు కోర్కె దీర్చగదవే! స్వాహావధూవల్లభా!

భువిగల దుర్బల దేహాల
నవమతి సేయింపబూను నధముల గాల్పన్
ప్రవిమల చరితుల పూజ్యుల
యవమానాగ్ని స్వరూప! యామద! రమ్మా!

ఘోరముగా మృతిజెందిన
వారికినై పరితపించు వారల కనులన్
నీరయి గుండెల మండెడి
దారుణ శోకాగ్నిరూప! దర్శన మిమ్మా!

అనకు దాసుల గుండెల
వాసముగానున్న కామవహ్నిని దలతున్

మౌనము నీచత్వము విడి
దోసము గోల్పడుచు నాకు దోచుము స్వామీ!

క్రూరులచే మరణించు కు
మారుల గాపాడ గడగు మాతల హృదియం
దారటమున జన్మించుచు
మీరిన వాత్సల్యవహ్నీ! మెయిగొనవయ్యా!

కన్నుల ముందర దుష్టులు
సన్నుతు గురుతుల్య పూజ్య జంపుచు నుండన్
కన్నుల నీరిడి నిల్చిన
ఖిన్నత జన్మించువట్టి కేతూ! రమ్మా!

బలముండియు సద్ధర్ముల
బలిజేసెడి దుష్టకర్మ వారింపకయే
నిలబడి చూచెడు హీనుల
బలమూడ్చుచు వహ్నిదేవ! పరుగున రమ్మా!

* * *

స్వాగతమ్ము గొను స్వామి మహాగ్నీ!
స్వాగతమ్మిదె ప్రజాపతి వహ్నీ!
స్వాగతమ్ము రగణాధిపతీ! సు
స్వాగతమ్ము గొనుమంజలి కేతూ!

జీవనాధారకా! చేతనోద్భూత సం
జీవ నోగ్రోష్ణ సంక్షిప్త రూపాత్మకా!
పావనా! పావకా! పాపసంహారకా!
దేవదేవా! మహాతీక్ష్ణతేజోనిధీ!

పీతవర్ణా! కృపాబ్ధీ! లయోగ్రోష్ణ సం
జాతరూపా! ప్రభూ! జాతవేదా! విభా!
పితృహోత్రా! మనోప్రీతిదాతా! శుచి
ఖ్యాతతేజోనిధీ! స్వాహావధూవల్లభా!

జ్వాలికామాలికాజాలలోకోన్నతో
ద్వేల బీభత్సరూపీ! కృశానూ! మహా
గ్ని! లయంకారణా! నిన్ను నే గొల్చెదన్
నీ లయాకారమున్ నే భరింతున్ ప్రభూ!

రక్తవర్ణాత్మక రాజిత హుతవహా!
నా కన్నుదోయిపై నాట్యమాడు
బంగారు ఛాయలో పరగెడు నోవహ్ని!
ప్రబలుమా కరుణతో ఫాలమందు
చటులోగ్ర గతి దూకి చిటపటమను నగ్ని!
క్రోధాధరములపై కొలువు సేయు
నీలాభ్ర సమరూప నిర్మలోజ్వల కేతు!
నిలువుమా నాతల నియతిబూని
సర్వభక్షక! నీ పేరు సార్థకముగ
వేయి నాల్కలు సాపి నీ వేడ్కదీర
సర్వలోకము గ్రసియింప సాగిరమ్మ
కార్యకారణరూపివై కదలువాడ!

పవనమ్ములోనున్న బంగారు నా స్వామి!
అగ్నిదేవా! గుండె నలముకొనుము
జలముల తెల్లనై జన్మించు నా స్వామి!
అగ్నిదేవా! రక్త మలముకొనుము
భువిపైన పచ్చగా పొలుపొందు నా స్వామి!
అగ్నిదేవా! చేతు లలముకొనుము
గగనవీధిని జ్యోతి గల్గించు నా స్వామి!
అగ్నిదేవా! మది నలముకొనుమ..

సర్వదేహము వాడి నీ శక్తి కొరకు
నాయుతము జేసియున్నాడ నరుగుదెమ్ము
లోహితాశ్వద! నీల విలోచనముః
నన్ను లయకారుగా చేయుమన్న! వహ్ని!

## అగ్నిస్తుతి

పద్మకోశము బోలి ప్రబలెడు నెడదలఁ
గణకణమనురూపు గలుగువాడ!
నీలమేఘమునుండి నేలజారెడి కాంతి
లీలగా మనసుల నేలువాడ!
వరిగింజ మొనపైన పరగెడు నిశితమ్ము
వలె సున్నితమ్ముగా వెలయువాడ!
వన్నెనై పచ్చనై చక్కనై తెల్లనై
వివిధరూపుడవౌచు వెలుగువాడ!

ఓయి వరముడ! యింద్రుడ! ఓయి బ్రహ్మ!
ఓయి పరమాత్మ! జీవాత్మ! ఓయి దేవ!
సర్వభూతాత్మకా! జీవశక్తిదాత!
నన్ను జేరుమ! ఓ యగ్ని! సన్నుతింతు!"



# జర్కాన్

"త్రిపుర"

ఇది వనువూ కాదు, ఆకుపచ్చా కాదు. మిరిమిట్లు గొలపదు. అంగుళం పొడవూ, నాలుగు ముఖాల అందం దీనిది. ఎన్నివస్తువులు పారేశాను? యిచ్చేశాను? యిది మాత్రం యింకా యిప్పటికీ నాదగ్గర ఉంది. ఉపయోగం లేదు. దీని ఖరీదు తెలీదు నాకు. విలువ?

హార్బరూ, ఏర్‌పోర్టులూ, స్టేషనూ నా జీవితంలోని మజిలీలని సూచిస్తాయి. అర్ధరాత్రి సమయాల్లో రైళ్ళు మారడం, హార్బర్ దీపాలు మెల్లగా వెనక్కి వెళుతూ దండల్లాగ మారుతూంటే డెక్‌మీద నిలబడి నీళ్ల గలగల వినడం, ఉక్కు రంగు తెల్లవారుజాముల్లో డల్‌గా ఏర్‌పోర్టు లాంజుల్లో కూచుని నిరీక్షించడం...వెనక్కి చూస్తే, ఇవే నా జీవితంలోని మలుపుల్ని సూచిస్తున్నాయేమో నని అనిపిస్తుంది. 'విలువల' ప్రమేయం లేదు నాకు. స్థిరంగా నిలబడి, నలుగురి మధ్యా ఉండి, మనుష్యులతో, వస్తువులతో సంబంధాలూ, మమతలూ పెంచుకుంటున్నవాళ్ళకి విలువలు. అయితే, దీనికి విలువ కట్టకపోవడం?.........

'దీన్ని మీకు ఎందు కిస్తున్నానో నాకు బాగా తెలియదు. నాకు అప్పుడప్పుడు యిలా యివ్వాలని ఉంటుంది. ఈ నెల రోజుల్లోనే మీరంటే నాకు అమితమైన స్నేహభావం ఏర్పడింది. ఇంతకంటె ఖరీదైనవీ, అందంగా ఉన్నవీ నాదగ్గర మీరు చూశారు. కాని యిదే యిస్తున్నాను.'

తెల్లవారుజామున, మింగ్లడాన్ ఏర్‌పోర్ట్‌లో, నన్ను సాగనంపడానికి వచ్చి, వచ్చిపోయే విమానాలు చెవులు బద్దలుకొట్టుతూ శబ్దం చేస్తూంటే, ఉల్లి పొర కాగితం విప్పి, దీన్ని యిటూ అటూ తిప్పి చూపించి, నా చేతిలో పెట్టి, వీరాస్వామి అన్న మాటలు. 'సంగిరి'గా, సిగ్గుగా, భయంగా అన్న మాటలే అంటూ, మళ్ళీ రద్దుచేస్తూ, వీరాస్వామి దీన్ని నా చేతిలో పెట్టాడు, నా ముఖం చూడకుండా, చూడకుండా ఉండడానికి ప్రయత్నిస్తూ, ఆ ప్రయత్నంలో నా హృదయానికి చాలా దగ్గరగా వస్తూ.

వీరాస్వామికి సిగ్గు, భయం, 'సంగిరి'తనం చాలా దూరం. కాని ఆ క్షణంలో అతని సహజ గుణాలు మాయమయిపోయాయి.

తీసుకోక ఏం చేస్తాను? ఇవ్వడం అలవాటయిన నేను!

సిగ్గు, భయం వీరాస్వామికి చాలా దూరం. 'నేషన్' ఎడిటర్‌కి నేను రాసిన ఉత్తరం చదివి, నా ఎడ్రస్ సంపాదించి, నాకు రాశాడు వీరాస్వామి. తనకి కూడా 'క్రెమటోరియా' గురించి స్థిరమైన అభిప్రాయా లున్నాయన్నాడు. వాటి గురించి ఆలోచించే ఆంధ్రులున్నారని సంతోషంగా ఉందన్నాడు. రంగూన్ వచ్చినప్పుడు తనను కలవమన్నాడు. ఉత్తరంమీద ఉత్తరాలు కురిపించాడు, మొదటి దానికి తప్ప నేను జవాబే రాయకపోయినా. అంతేకాదు. తన మాండలే స్నేహితుంకికూడా రాశాడు నన్ను చూడమని. అతని స్నేహం ధాటికి తట్టుకోవడం కష్టమయిపోయింది. క్రమంగా 'క్రెమటోరియా' అడుగున పడిపోయాయి. అతని ఉత్తరాలు ఆత్మకథరూపం దాల్చాయి. అతని ఆశయాలూ, ఆశలూ, అభిరుచులూ.

'హక్కులూ, స్వామ్యం అని అరిచే వెధవల్ని హతమార్చాలి. ఎలా అనుకున్నారు? గోడకి నిలబెట్టి, చేతులెత్తించి, మెషీన్‌గన్‌తో టకటకా మని.'

'ప్రపంచం జనాభాలో ముఖ్యంగా మనదేశపు జనాభాలో నూటికి తొంభయిమంది పురుగుల్లాంటి వాళ్లు. ఫ్లిట్‌కొట్టి చంపినట్లు చంపాలి.'

'సంగీతం ఎవరి కర్థమవుతుంది? కుస్తీలు పట్టి ఒకేసారి పదిమందిని చిత్తుచెయ్యగల వాళ్లు ఎంతమంది ఉన్నారు?'

'చచ్చిన తరువాతకూడా లక్షసేవలు చేయించుకుంటారు, యీ అధమాధమ మానవులు. కట్టెలు, నెయ్యి, రబ్బిష్, కాఫిన్లు, మంత్రాలు, ప్రార్థనలు, ఏనివర్సరీలు. ఒక సెకండులో బుగ్గి అయ్యే యీ స్టుపిడ్ కళేబరానికి యిన్ని పరిచర్య లెందుకో... అందుకే మీరు క్రెమటోరియా గురించి రాసింది నాకు నచ్చింది.'

ఉత్తరాల్లో ఊహించుకున్నట్లుగా లేడు వీరాస్వామి. ఆరడుగుల రెండంగుళాల సన్నటిపొడుగు. పలచని ముఖం.

'మిమ్మల్నిచూస్తే ఎందుకు నాకు యింత సంతోషంగా ఉందో చెప్పలేను. ముఖస్తుతి అనుకోకండి. కాని మీలోని శాంతస్వభావం, ఎంత లోపలికి చూడగలిగే శక్తి, నన్ను మరింత దగ్గరగా లాగుతూంది.' అన్నాడు విశాలమైన కళ్లల్లో మెత్తటి, తెల్లని అమాయకత్వం పిడలా కదులుతూంటే. 'ఇన్యా' పరమ్మ నీలి అలలు అతని కళ్లల్లో సున్నితంగా మెదిలాయి.

'అప్పుడప్పుడు అనిపిస్తుంది' మనదేశానికి తిరిగి వెళ్లిపోయి, దేశాన్ని మరమ్మత్తు చేద్దామని. తుడవాలి. ఇనప చీపుళ్లుపెట్టి దేశాన్ని తుడవాలి. మిగిలిన చెత్తని కాల్చాలి. ఒకసారి అంతా కాల్చి శుభ్రం చెయ్యాలి.' స్ప్రెక్‌క్రీట్‌తో తన యింటి బాల్కనీలో నిలబడి కిందని రోడ్డుమీద ట్రాఫిక్ వేపుచూస్తూ అన్నాడు.

వాగ్నర్ 'లోహెన్‌గ్రిన్' నేపథ్యంగా వినిపిస్తూంది. 'ఎల్సా'తో నిజం చెప్పడానికి బాధపడుతున్నాడు లోహెన్‌గ్రిన్. ఇక్కడి తన కార్గోబోట్ల సామ్రాజ్యాన్ని త్యజించి, దేశం వెళ్లిపోవాలంటాడు వీరాస్వామి. అంతా కొత్తగా, మొదటినుంచి మళ్లీ మొదలుపెట్టాలి. కాని......

ఎలా వదలిపెట్టడం. ఇంపల్స్ కావాలి. వదలిపెట్టి వెళ్లడానికి కావలసిన పనులు. కాగితాల పనులు, చెప్పవలసిన జవాబులు, రూల్స్, రెగ్యులేషన్స్‌ని డబ్బులో, డబాయింపులో పక్కకి నెట్టడం, దానిలోని విసుగు, శ్రమ—ఆ భారాన్ని తలుచుకుంటే నిస్పృహ. కాని,

వదలిపెట్టాలి. జుత్తులోంచి వేళ్లు గట్టిగా, పిచ్చిగా పీక్కుంటూ అన్నాడు. 'మా తాత సృష్టించిన సామ్రాజ్యం యిది. ఈ దేశం అంతా వ్యాపించింది. వేళ్లతోసహా ఎలా పీకడం? ఇంపల్స్ కోసం కాసుక్కూచున్నాను. మీరు......'

నలుపా?

విసుగూ, అలసటా వచ్చింది నాకు. నాలో ఉన్న శక్తి అది. అందరిచేతా చెప్పించుకుంటాను. నాలో అద్దం చూసుకున్నట్లు చూసుకుంటారు.

'ఆరవయి సంవత్సరాల చరిత్రని మీరు రద్దు చెయ్యలేరు అనుకుంటాను. చేస్తేమాత్రం, మిమ్మల్ని సూపర్‌మాన్ అనుకోవచ్చు.'

ఎందుకోగాని, వీరాస్వామికి నవ్వు వచ్చింది.

నవ్వితే, ఎంతో 'పెద్దగా' కనిపిస్తాడు. ఆ నవ్వులోనే పెంకితనం, మంకుతనం కూడా స్ఫురిస్తుంది. గోడమీద ఎత్తుగా వీరాస్వామి తండ్రి ఫోటో ఉంది. చుట్టూ కాగితంపువ్వులదండ. గదంతటికీ అదొక్కటే 'పాత'దనానికి కన్సెషన్‌లా కనిపిస్తుంది. తలపాగాకింద వీరాస్వామి తండ్రి కళ్లల్లో ఆయస్కాంతపు చూపులు దైవభక్తికి నిదర్శనాలున్నాయి. ఎదురుగా పెడెస్టల్‌మీద ఒక కార్గోబోటు మోడల్ ఏనుగుదంతంతో చేసింది, ఉంది.

వీరాస్వామి రికార్డ్ ఛేంబర్‌లోంచి రికార్డులు తీస్తూ అన్నాడు:

'బర్మా ప్రభుత్వం నాకు చిన్నప్పుడు ఒక మెడల్ యిచ్చింది. ఎందుకనుకున్నారు? కాలుతున్న యింట్లోకి జొరబడి మూడేళ్ల అబ్బాయిని పైకి తీసుకొచ్చాను. మచ్చలు యింకా ఉన్నాయి.'

మెడల్ యిచ్చిన ప్రభుత్వమే అతన్ని ఒక రేప్ కేసులో విచారణ చేసింది. అతని క్రూరత్వం భరించలేకే అతని భార్య ఆత్మహత్య చేసుకుందని అక్కడ అందరికీ తెలిసిన విషయం. అతనికింద పనిచేసేవాళ్లు అతని మూడ్స్‌ని గ్రహించలేక, భరించలేక మసి అయిపోయారు.

వీరాస్వామి ముఖంలో 'బాల్యం' బాగా కనిపిస్తుంది. గొంగళి పురుగుల్ని సునాయాసంగా చేత్తో నలిపి చంపే బాల్యం, గ్లాసులోని పాలు తాగకుండా పిల్లిపిల్లకు పోసే బాల్యం అది. కోపంకొద్దీ ఖరీదైన గడియారాన్ని నేలకేసి కొట్టడం 'అడివి'తనం.

'మీరు అదృష్టవంతులు. మిమ్మల్ని చూస్తే నాకు అసూయగా ఉంది. ఇవాళిక్కడ. రేపు యింకెక్కడో. మీ ఆశయం నాకు నచ్చింది. ఈ సంవత్సరం మాండలేలో బుద్దిస్ట్ ఫిలాసఫీ టీచ్ చేశారు. ఇక్కడనుంచి బేంగ్‌కాక్‌కి వెళ్తున్నారు. అక్కడ మొనాష్టరీలో ఉండడానికి.........'

బాఖ్ సంగీతం వింత అనుభూతిని కలిగిస్తుంది. స్నేహం ఏర్పడుతూంటే దానిలోని మాధుర్యాన్ని ఎక్కువ చేస్తుంది. వీరాస్వామినిచూస్తే 'జాలి' వేసింది. అంతటి సుఖాన్నిచ్చే వాతావరణంలోనూ అసంతృప్తి. ఆశయాలున్నా, వాటివేపు ప్రయాణం చెయ్యడానికి కావలసిన ఉత్సాహాన్ని ఏదో దుష్టశక్తి అరికట్టుతూంది, హరిస్తూంది 'ఇంపల్స్' కాదు అతనికి కావలసింది. తన్ను తాను తెలుసుకోవాలి. తనకేది కావాలో తెలుసుకోవాలి. తెలుసుకోవచ్చని తెలుసుకోవాలి. తనలోంచి తను వేరుబడి తనను వేరే చూసుకోవడం నేర్చుకోవాలి. ఆ క్షణంలో, అతను ఏమిటి చెయ్యాలో, అతని గమ్యం ఏమిటో అతనికే తెలుస్తుంది. నా జీవిత విధానాన్నిచూసి అతను అసూయ చెందడం కాదు కావలసింది. అదే చెప్పాను అతనికి. ఏదో పుస్తకంలోని పాఠం అప్పజెపుతున్నట్లు అనిపించింది.

'నిజమే అనుకోండి. కాని మిమ్మల్ని యిలా దగ్గరగా చూస్తూ, మీ మాటలు వింటూంటే మిమ్మల్ని నా గురువుగా చేసుకుని అనుసరించాలని ఉంది' అన్నాడు.

అతని మాటల్లోని విషాదం నాకు చాలా భయంకరంగా కనిపించింది.

'మీ ఆఖరి క్షణాలు ఏదో ఉత్తర హిందూస్థానం ట్రెయిన్‌లో గడుపుతారు. మీ దేహాన్ని చిన్నగుడ్డిదీపంస్టేషన్లో దింపేస్తారు. మిమ్మల్నక్కడ వదిలేసి, మెల్లగా బరువుగా వెళ్లిపోతుంది పేసెంజర్' అన్నాడు మళ్లీ.

......ఒక్కొక్కప్పుడు తెలుస్తుంది నాకు. నన్నుకూడా మిగతావాళ్లు 'స్టడీ' చేస్తుంటారనీ, నా 'లోతులు' తెలుసుకోడానికి ప్రయత్నిస్తుంటారనీ, నా జీవిత విధానాన్ని, దాని 'అంతాన్నీ' ఊహిస్తుంటారనీ. అలా బలంగా, లోతుగా నాకు తెలిసినప్పుడు, దానికి వ్యతిరేకంగా, వారి ఊహల్ని, నిర్ధారణల్ని తప్పుగా నిరూపించడానికని, 'మెలోడ్రామటిక్'గా నా విధానాన్ని మార్చగలిగే 'బాల్యపు' ప్రేరణలు, అంతర్గతంగా ఉన్నా, పైకి ఒక్కసారిగా వస్తాయని కూడా నాకు తెలుస్తూనే ఉంటుంది. ఈ తెలుసుకోవడంతోనే ఆపగలగడం నా ధ్యానం, నా శిక్షణలో ఒక భాగం అనుకుంటాను. నా జీవితంలోని మలుపులకి కారణాలు యీ 'ప్రేరణలే' అని గట్టిగా చెప్పడానికి నా ప్రయాణాలే నాకు సాక్ష్యం, నా బలహీనతని నిరూపించే చిహ్నాలు...అనికూడా అప్పుడప్పుడు.

నవ్వొచ్చింది. 'సినిమా చావులు అందరికీ రావు. అయినా, నాకు అలాంటి చావు యిష్టంలేదు. కొడుకులూ, మనుమలూ మంచం చుట్టూ కూచుని ఉంటే, వాళ్ల కళ్లల్లోని భావాల్ని పరిశీలిస్తూ...'

'మీకున్న ఆస్తి ఏమిటి? మనవలూ, మనవరాళ్లూ కూచుని మీకెప్పుడు గుటుకేస్తారా అని

చూడ్డానికి? యూ షెప్‌బాగూ, అందులోని రెండువున్న కాలూ, మీ సెప్‌బోర్యూ కదూ, వాళ్ళందరూ వద్దు లెండి. ఆ గుడ్డిదీపంకింద రగ్గుతో కప్పబడిన శవం మీదే నా ఆశని వ్యర్థం చెయ్యకండి.'

దరిదాపు శవంలాగే చూశాడు నన్ను వీరాస్వామి మొట్టమొదటిసారి. జ్వరంతోనే డేగన్ మెయిల్ ఎక్కాను మాండలేలో. పిన్‌మనా వచ్చేసరికి సలసల కాగింది దేహం. రాత్రంతా అక్కడే ఆగింది ట్రెయిన్. డెలీరియమ్‌లో పాతజీవితం అంతా పీడకలల రూపంలో పునర్దర్శనం యిచ్చింది. మర్నాడంతా లోటి ప్రయాణికుల అదుర్దా—కమ్యూనిస్టులు రైలుపట్టాల్ని మైన్‌చేశారనీ, ట్రెయిన్ యిక ముందుకు వెళ్ళదనీ. దారిలో అక్కడక్కడ కాల్చిపారేసిన మొండిగోడల రైలుస్టేషన్లు దాటుకుంటూ డేగన్ మెయిల్ చీమలాగ ప్రయాణం చేసింది.

వీరాస్వామి ఆప్యాయతా, స్నేహం, మొదటి రోజునుంచీ తెలిసింది. అతని సేవతో నాలుగురోజుల్లో పోయిన సత్తువ అంతా తిరిగివచ్చింది. అతని మృదువైన చేతులు దేహానికి ఎంతో అహ్లాదం కలిగించాయి.

రెండురోజుల తరువాత, నాకు స్పంజ్ బాత్ యిచ్చి, నాలుకుర్చీలో కూచోబెట్టి, దువ్వటే మార్చుతూ, అన్నాడు: 'మీ బుద్ధిస్ట్ ఫిలాసఫీ, —వ్యవహారం మానీ గొప్ప బిడ్డుగానో, బట్టతలతోనో ప్రత్యక్షం అవుతా రనుకున్నాను. కాని యిలా టెక్సాస్ కౌబాయ్‌లాగ ఉంటారని కలలోనైనా అనుకోలేదు.'

'హామ్‌లెట్ హోరేషియోతో అన్నమాట నిజం' అన్నాను నవ్వుతూ.

'జ్వరం బాగా తగ్గి, బాగయిన తరువాత మీచేత రంగూన్‌కి ఎల్లిరంగు పూయిస్తాను' అన్నాడు.

స్ట్రాండ్‌లో కూచుని, రంగూన్ రివర్ వేపు చూస్తూ, నీటిల్లో దీపాల దండలని కదిలిస్తూ లాంచీలూ, స్టీమర్లూ పోతూంటే, విస్కీ తాగాం. జిన్ అండ్ బిట్టర్స్. మృదువుగా షెర్రీ మధ్య మధ్యని షాంపేన్.

'దేశాన్నంతటినీ ఊపాలి. ప్రజలు నాకోసం పరితపించాలి. బాల్కనీలో నిలబడి, కిందని గుంపులు గూడిన ప్రజలు చీమలలకాయల్లా కనిపిస్తూంటే, ట్రేపన్‌గా చెయ్యి ఊపాలి,' అన్నాడు వీరాస్వామి కుర్చీలో వారబడి, కళ్ళు పెద్దవిచేసి షాంపేన్ కలుకుంటూ.

ఓపెల్ కారులో యిన్యా లేక్‌కి వెళ్ళి అక్కడ చెట్లకింద చల్లటి చీకటిలో కూచున్నాం.

'నా ముత్తాత యిక్కడ టింబర్‌కూలీగా మొదలుపెట్టాడు తాత కార్గోబోట్లమీద వ్యాపారం చేశాడు. నాన్న కార్గోబోట్లు కొన్నాడు. నా చేతుల్లో కార్గోబోట్ల సామ్రాజ్యం తయారయింది. ప్రతి రివర్ పోర్ట్‌లోనూ నా బోట్లు ఉన్నాయి. నాన్న స్నేహితుల్ని రూపుమాపు లేకుండా చెయ్యగలిగాను. అడ్డుగా నిలబడ్డవాళ్ళు, పోటీకి వచ్చినవాళ్ళు, అడుక్కు తింటున్నారు. కట్టుబట్టలతో తిరిగి వెళ్ళారు. నేను చెయ్యని అన్యాయం లేదు. ఉపయోగించని అస్త్రం లేదు. హతం చేశాను. కొంతమందిని నా కింద జీతగాళ్ళుగా పడేసి ఉంచాను' అన్నాడు చీకట్లోనించి దూరంగా దీపాలను చూస్తూ.

నరమ్సులో దీపాలు. బెంచీలమీద సంభాషణల ఆఖరకువచ్చిన ప్రేమికులు. జీవితంలో చాలా దూరం ప్రయాణం చేసినట్లనిపించింది. ఎందుకోగాని నా చుట్టూ నిశ్శబ్దం ఆవరించినట్లయింది. ఎంతో దూరంనుంచి వీరాస్వామి మాటలు వినిపించినట్లు తోచింది. యధార్థంలేని ఖాళీ ప్రపంచంలో తేలుతున్నట్లుగా. మిక్స్‌చేసిన డ్రింకులు తల కెక్కినట్లున్నాయి.

...ఇప్పటికీ అనిపిస్తుంది, వీరాస్వామి మాటలు నన్ను ఎడ్రస్‌చేసి చెప్పబడలేదని. తనలో తానే మాట్లాడుకున్నాడు. రిలీఫ్ కావలిసివచ్చింది. నన్ను ఉపయోగించుకుంటున్నాడన్న భావంకూడా నా తలలో ఎక్కడో అడుగున నల్లగా, రహస్యంగా మెదిలింది.

'రూబీదగ్గరకు వెళ్దాం, పదండి' అన్నాడు వీరాస్వామి చెట్ల చీకట్లలోంచి లేస్తూ.

ఈ 'రూబీ'లు ప్రసాదించే సుఖంలోని విషదపు లోతులు ఎన్నిసార్లు, ఎంత గాఢంగా తెలుసుకున్నా. కల్యాణి, కల్యాణి, అంధకారానికుండే దారుణ

మైన ఆకర్షణ వెలుతురుకి లేదనిపిస్తుంది. భయంకరమైన అందం అది. వర్ణావికుండే సౌందర్యం, లావణ్యం యీ ప్రపంచంలో దేనికుంది, కల్యాణీ !

నీ గొలుసులోని లాకెట్‌లో యీ జర్కన్‌రాయి చాలా 'శాంతి'గా ఉండేది కల్యాణీ. మిరిమిట్లు గొలపదు. సుస్నితంగా మెరుస్తుంది. చల్లని నీటితో దేహాన్ని స్నానం చేయిస్తుంది.

మఖ్‌మల్‌మీద పొందిగ్గా అమర్చిన వజ్రాలు, జాస్పర్, ఎగేట్, ఓపల్, జేడ్, ఎమెరల్డ్, రూబీ, గార్నెట్, సెఫైర్, అమెథిస్ట్, జాసింథ్, బెరిల్, టర్మలీన్, ఓనిక్స్, టొపాజ్, టర్కాయిజ్...రంగులు, మెరుపులు, కాంతులు, కిరణాలు...అన్నివందల రకాల 'రాళ్ల'లోనూ యీ జర్కన్ మృదువుగా మోడెస్ట్‌గా, సిగ్గుగా కనిపించింది నా కళ్లకి. అలాఅని అంటే,

'మీ టేస్ట్ కొంచం ఆశ్చర్యకరంగానే ఉన్నా, సజెస్టివ్‌గానే ఉంది.' అన్నాడు వీరాస్వామి జర్కన్‌ని పైకి తీసి యిటూ అటూ తిప్పుతూనూ.

'మీలో ఒక గొప్ప గుణం ఉంది. మీ అనుభవాన్ని కాదనరు. కాని వాటిని మీ రక్తంలోకి జారబడ నియ్యరు. అవునా?' అన్నాడు మళ్లీ, రాత్రి అనుభవం నా కళ్లలో యింకా మిగిలి ఉందేమో అని పరీక్షగాచూస్తూ.

అవునో కాదో అప్పుడు చెప్పలేకపోయాను. జవాబు యిదీ అని ఊహించుకుని మాటల్లో చెప్ప దలుచుకుంటే, చెప్పడానికి ప్రయత్నిస్తే, ఒకసారిగా గర్వం, 'అహం' తెలియకుండా వెనుకపాటుగా ముట్టడిచేసి...మాటల్లో విపరీతమైన 'ట్విస్ట్', అసత్యం...బంగారు పూత...వెలిగే అసత్యం. 'నిజం యొక్క కఠోరత్వాన్ని కప్పిపుచ్చే అసత్యపు ఆకర్షణ... యివీ, నిజంయొక్క అసలు వెలుగుని చూడలేక బెదరడం, భయం! మనస్సుతో 'తెలుసు'కో గలిగినా, 'తెలుసుకోవడం' నా శిక్షణలో ఒక భాగమయినా, నేను అన్నమాటలలో ఖంగుఖంగుమని సత్యం ఎప్పుడూ మోగదనీ, ఏది నిప్పులాగ నిజమో, ఏది వేషధారణో చెప్పలేననీ......

యీ జర్కన్ రాయి, ఆ డిసెంబరు చలిలో తెల్లవారుజామున మింగ్లడాన్ ఏర్‌పోర్ట్‌లో నాచేతిలో పెట్టాడు. ఎన్ని వస్తువులు యిచ్చేశాను, పారేశాను? కాని యిది యిన్ని సంవత్సరాలూ నా దగ్గరనే ఉండిపోయింది. ఒక్కసారిమాత్రం వచ్చింది అవకాశం యిది నా దగ్గరనుంచి పోయేందుకు. కాని ఎంత కఠినంగా వచ్చింది ఆ అవకాశం!

వీపుమీద తట్టి, వెనక్కి తిప్పించుకున్న మనిషి వీరాస్వామి అని పోల్చుకోవడం చాలా కష్టమే అయింది. తిరగేస్తున్న పుస్తకం అలా పరధ్యాన్నంగా బుక్‌స్టాల్ కౌంటర్‌మీద పడేసి, ఆశ్చర్యంగా చూశాను. వాల్తేరు స్టేషన్లో నన్ను ఎవరు పలకరిస్తారు?

'భాస్కర్‌గారు కదూ?'

గొంతుకపట్టి పోల్చుకో గలిగాను.

రాగి రంగు జుత్తు నుదుర్ని బాగా కప్పేఉంది. ఖాకీ చొక్కా జేబులు రెండూ చిరిగి వేళ్లాడుతున్నాయి.

నన్ను బలవంతంగా వాల్తేరులో దింపి, రైలు పట్టాల పక్కనుంచి నడిపించుకుపోయాడు. 'మీకున్న పనేమిటి? షిప్ బాగా, పాస్‌పోర్టూ, అంతేనా? ఏ ట్రెయినయితే ఏమిటి? ఎప్పుడు వెళ్తే ఏమిటి?' అని బలవంతం చేశాడు.

సందులు. పాకలు. వేంకి అడుగుదూరందాకా దిగిన యిళ్ల తాటాకుల కప్పులు. తాటిచిప్పలు తన్నుకుంటూ పరిగెత్తుతూ ఒంటిమీద బట్టలేకుండా నల్లటిపిల్లలు. పాకలముందు రాళ్లమీద కూచుని కుండల్లోంచి డబ్బాలతో వేడినీళ్లు గుమ్మరించుకుంటుంటే కాలవలు సందుకి అడ్డంగా మడుగులు కడుతూ పారుతున్నాయి. కొబ్బరిచెట్ల వెనక సూర్యాస్తమయం. ఎక్కణ్నుంచో, అర్థమవని గుండెలు కోసే స్త్రీ రోదన.

వీరాస్వామి పాకలో వేంమీద చాప. మూలని హరికెన్‌దీపం. చీకటి.

గూళ్లల్లో అగ్గిపెట్టెకోసం వెతికి దీపం వెలిగించాడు. ఒకమూలని చిన్న రాళ్లకుప్ప. యితని

ముక్కలు. గుంకరాళ్లు. కోమగా పదునుగా ఎటువంటి రాళ్లు.

నా మూపు చూపి అన్నాడు. 'పందుల్ని కొట్టడానికి.'

ఏమిటి మాట్లాడేం ?

వీరాస్వామి అడుగులు తేలికగా పడుతున్నాయి అనుకున్నాను. గొంతులో బరువూ, ఆదుర్దా వినిపించలేదు అని కూడా అనుకున్నాను.

'వాళ్లందరి నేను వేరుబడి యిక్కడకు వచ్చాను' అన్నాడు.

ఎక్కడనుంచో చీమలు ఒకబారు కట్టి ఎక్కడికో వెళుతున్నాయి. దీపాన్ని తప్పించుకుని, పక్కగా ఆ బారు చీకట్లోకి పోతూంది. చీమల తలలు మెరుస్తున్నాయి దీపం కాంతిలో.

'అంతా యిచ్చేశాను. కొంత వాళ్లు తీసుకున్నారు. కేంపుల్లో జీవితం దుర్భరం. అందుకని యిక్కడ చేరాను.'

'దేశాన్ని మార్చాలి. ఎక్కడ్నుంచి మొదలు పెట్టాలో తెలియకుండా ఉంది. ఇక్కడ నేనంటే భయం, అనవ్యం. బోధపడ్డంలేదు.'

పాకలో వేడిగా ఉంది. వేడి ఏ నరానికి నివ్వంటించిందో, పిధిలో గట్టిగా అరుపులు, బూతులు మొదలుపెట్టింది ఒక అడగొంతు. ఆ వేడి చీకటిలో, యిమంపీద మొద్దుబారిన కత్తితో రాపినట్లయింది.

వీరాస్వామికి పరిధులు లేవు. పగంపగం పనులు చేతకావు. అడుగు చూడవలసిందే. శిఖరంమీదనే నిలబడాలి.

ఏర్ స్ట్రిప్ కట్టించడానికి కావలిసిన కూలీల గాంగ్ లో చేరాడు.

'ఆయితే ఒకటి. మెల్లిగా, తొందరలేకుండా ఆలోచించడం నేర్చుకున్నాను. మాటలు తగ్గించాను' అన్నాడు.

'మిమ్మల్ని యిలా యిద్దర్నీ కలిసి చూడ్డం ఎంత సంతోషంగా ఉందో చెప్పలేను' అన్నాడు మళ్లీ.

మార్పుని దగ్గరగా కాకుండా, దూరంనుంచి చూడడం అలవాటయిపోయింది. మార్పులు మార్పుల్లాగ కనిపించవు.

'ఆరేళ్లయింది. థాయ్‌లాండ్‌నుంచి తిరిగి వచ్చినతరువాత రాశారు నా ఉత్తరానికి జవాబు. హలండానుంచి అని జ్ఞాపకం. ఇప్పుడు సిలోన్ వెళుతున్నారు. మీ యాత్రలు ఎప్పుడు ఆపుచేస్తారు?' అన్నాడు, చీమలవేపు చూస్తూ.

ఏది యాత్ర? ఏది 'వృత్తి'? భేదం అదృశ్యమయిపోయింది. ఒకదానిలో ఒకటి కలిసిపోయాయి. రెండింటిలోని పదునూ మొద్దుబారినట్లు అనిపిస్తుంది. కాని విరామం లేకుండా జరుగుతూనే ఉంది యాత్ర.

మరిచిపోయింది ఏదీ లేదు. గంగ పొడుని, సాయంకాలం చుట్టూ మెత్తగా సాటిన్‌లాగ జారుతూ ఉంటే, రావిచెట్లమధ్యనుంచి వంకరతిరుగుతూపోయే యీ ధూళిబాటమీద మెల్లగా నడుస్తూ ఎన్ని సార్లు నడిచాం, కల్యాణీ, యీ రెండు సంవత్సరాలలో.

నీ కళ్ల అమాయకత్వంలోకి చూస్తూంటే, ఆలోచనల గొలుసు ఎక్కడో చీకట్లో ప్రారంభం అయి దూరంగా, చాలా దూరంగా తీసుకుపోయేది. నీ చుట్టూ ఒక 'గృహం' ఏర్పడేది. నీటిరంగు చిత్రంలోలాగ, మృదువుగా రంగులు స్పేస్‌లోకి జారుతూంటే, 'గృహం' ఏర్పడుతూంటే గొలుసు తెగేది. ఆ 'గృహం'లోకి అడుగుపెట్టలేకపోయ్యాను.

వస్తువులకి గొప్ప శక్తి ఉంది, కల్యాణీ. అవి వెళ్లవు పైకి. పారేసినా, యిచ్చేసినా, వాటి 'ప్రాణం' వాటితోకూడా వెళ్లదు. ఎన్ని పారేశాను? ఎన్ని చేతులలో నిజంగా విసిరేశాను? యిచ్చేశాను? యీ రెండేళ్లలోనూ వాటి 'కసి' తీర్చుకున్నాయి. ఎంత 'పగ', ఎంత 'పట్టుదల' వాటికి? పుస్తకాలు గుట్టలుగా చేరిపడ్డాయి. కుర్చీలు. బట్టలు. యీ జోళ్లు. యిన్ని జోళ్లు! ఇల్లు. గోడలు. గదిలోంచి గదికి. చుట్టూ. పైన. లోపల. ఎత్తు. వెడల్పు. బైలు.

అందుకే కల్యాణీ, ఆ గృహంలోకి అడుగుపెట్టలేకపోయాను. వీటిని కూడా విసిరేయాలి, పోవాలి.

అంతేకాదు. నీకు బోధపడలేదు, నీ యింట్లో నీ కిచ్చిన 'స్వాతంత్ర్యం' నాకు అర్పణం చేద్దామనుకున్నావు. నీ కళ్ల అమాయకత్వం నీ దేహంలో లేదు. మిరిమిట్లు గొలిపే దేహాన్ని ఒక అస్త్రంలాగ ఉపయోగించదలచావు నా మీద. అది 'పూలబాణం' అవలేకపోయింది, కల్యాణీ, నా మీద.

నీ ఆశయం, నీ 'కోరిక' నా బాధ్యతగా తీసుకోలేదు, తీసుకోలేకపోయాను. నిన్ను పోలేయడంలో, అంతదారుణమైన ఫలితాలు ఉంటాయని ఊహించలేను, కల్యాణీ.

యీ 'జర్కన్'ని తిరగ్గొట్టి పంపించావు. అది నీ లాకెట్‌లో చాలా ప్రశాంతంగా, నమ్రతతో మెరిసేది. కాని వస్తువుల పగ నా మీద చాలా తీవ్రం.

ఎఱ్ఱటి మధ్యాహ్నపు ఎండలో, వాల్తేరు స్టేషన్లో, దీన్ని వీరాస్వామికి తిరిగి యివ్వబోయాను. ఏదో పాతకాలంలోని సందర్భం అకస్మాత్తుగా ఎదురయినట్టు చూశాడు. తీసుకోలేదు. జ్ఞాపకం మెరిసి మాయమయిపోయింది. 'అవసరం' లేదు అతనికి. నా దగ్గరే ఉండిపోయింది.

'కొన్నాళ్లనుంచి ఒక కల 'నిజం'లాగ వెంటాడుతూంది, ప్రతిరోజూ. ఒక్కొక్కప్పుడు మెలకువగా ఉన్నప్పుడే. వీరాస్వామి తాతయ్య దగ్గరికి నాలుగేళ్ల చిన్నారి మందుకని వస్తుంది. పొట్లాం మందు. తాతకి తెల్లటిగెడ్డం. ఎడమ బుజాన తాయెత్తు. వణుకుతూ, చాపమీద కూచుని, తెల్లటి పొట్లాలలో కట్టిస్తాను.' అన్నాడు వీరాస్వామి విశాఖపట్నం బీచ్ యిసుకలో పడుకొని నక్షత్రాలవేపు చూస్తూ. 'ఆ పిల్ల నా ప్రతిభ. వాళ్లకి మందులు యివ్వాలి నేను. కాని మందు ఏమిటో, అది ఎలా యివ్వాలో, దాని మోతాదేమిటో నాకా కలలో కనిపించలేదు.'

మళ్లీ అన్నాడు నా వేపు జాలిగా చూస్తూ. 'మీతో తీసుకుపొండి నన్ను.'

'అలాగే' అన్నాను ఆలోచించకుండా.

కొంచెంసేపు ఆగి అన్నాడు. 'రాలేను. ఇక్కడే ఉండాలి. ఏదో...'

వీరాస్వామి నాతో రాలేదు. 'జర్కన్'ని తీసుకోలేదు నా దగ్గరే ఉండిపోయింది. అవకాశం వచ్చినా, నా దగ్గరనుండి వెళ్ళిపోలేదు.

నువ్వు ఆశ్చర్యపోయావు దీన్ని నీకు యిచ్చినప్పుడు. ఇది 'మిలియన్ డాలర్ల' ఆశ్చర్యం కల్యాణీ! 'స్త్రీత్వం' నీలో పరిపూర్ణత చేకూర్చుకుందికి ప్రయత్నం చేస్తుంది. గొలుసులు గొలుసులుగా ఆలోచనలు మొదలుపెడతాయి నాలో. రావిచెట్ల నీడల్లో గొలుసులు. దూరంగా గంగవొడ్డుని రాసుకుంటూ, మెల్లగా మాట్లాడుకుంటూ ప్రవహిస్తూంటే, ఆకులు స్వాగతం చెప్తున్న సమయంలో, ఆ ఆకుల్లోంచి వెన్నెల మృదువుగా నీ ముఖంమీద పడుతూంటే 'ఆత్మ' దర్శనమే అవుతున్నట్లు అనిపించింది......

......చుట్టూ కనిపించే వస్తువులూ నా అనుభవాలూ, వాంఛలూ అన్నీ నీలోనే ఉన్నాయి.

అన్నీకూడా నువ్వే. నీ నవ్వు కదిలించినా అది నన్ను కదిలించినట్లే. నేను నాటినేను చూస్తూ ఉంటే, అది నువ్వుచూస్తూ ఉన్నట్లే. నువ్వు ఎక్కడ ఉన్నావు? ఆకళ్ల వెనుక కాదు. ఆ తలలోనూ కాదు. ఆ తలలో మెదిలే చీకట్లలోకాదు. అక్కడ ఏమిటవుతూందో తెలియదు నాకు. తెలుసుకోవడం అసంభవం. నాజీవం. నా ఉనికి, నాలోకాదు, కల్యాణీ, నాముందు, ఇదిగో, యిక్కడ, పైని, నా ముందునే ఉంది. అక్కడే నువ్వు కూడా. నేనుండే ప్రపంచం మరేదికాదు: అదే నా ఆత్మ. ఇదంతా నా ఆత్మరే అందులోనే నేనున్నాను. అందుకే నేను నీలోనే ఉన్నాను. ఇంతకంటే వేరే నిజంలేదు. నువ్వు... నువ్వు నీ శరీరం ముసుగుల వెనక ఎక్కడో లేవు, ఇక్కడ...యిక్కడ, నీ కాన్షస్‌నెస్ అంతటితోనూ నన్ను అదుముతూ, నన్ను అందులో 'కలిగి' ఉంచుతూ, నా సర్వస్వాన్ని అందులో మిళితం చేస్తూ......

... గొలుసులు.

... గొలుసులు: విశాలంగా చెదిరి, పెరిగే వలయాలు, విషవలయాలు. వెన్నెల గంగ యింద్రజాలం ... ఆకుల స్వగతంలో మార్దవంగా ప్రేమలత.

నీ బాధ్యత నా భుజాలమీద వేసుకోలేదు. కల్యాణీ, వీరాస్వామి నాతో మొదట నైజంగా వస్తానన్నా నాతో రాలేదు. ఇలా చుట్టూ ఏర్పడే వలయాలు దాటుకుంటూ వెళ్తుంటే, ఏదో బాధ, అకస్మాత్తుగా, అనుకోని సమయాల్లో బలంగా, గాఢంగా, లోతుగా, తన ఉనికిని వెక్కిరిస్తూ తెలియజేస్తూనే ఉంది. కెరటాలలో కదిలేది నీళ్లేనా?

యీ జర్కిన్ నాతోనే ఉండిపోయింది.

ఎందుకు తీసుకుంటాడు మళ్లీ వీరాస్వామి దీన్ని? అమ్మి, కొన్నాళ్ల కష్టం లేకుండా గడుపుతాడా? ఇంకెవ్వరికేనా ఇవ్వగలడా? దీనికీ అతనికీ ఏ విశేషమైన అనుబంధంలేదు. నాలుగేళ్ల పసిపిల్లకి ఏదో మందు, ఏదో మోతాదులో యిస్తాడు.

నాగార్జునకొండ వెళుతూ శాస్త్రి స్టేషనులో వీరాస్వామి జ్ఞాపకం వచ్చి, మూడేళ్లలో ఏమి మార్పులు వచ్చాయో చూద్దామని దిగేను.

వెన్నెలలో కొబ్బరిచెట్ల సంగీతం వింటున్నట్లు తలయ్యాపుతుంటే, మేఘాల్లోని ఆకాశంలో నక్షత్రాలు పండుగ చేసుకుంటున్నాయి. సందు చివర్లో ఎవరిదో పెళ్లి. భయంకరమైన శబ్దంగా వస్తూంది రికార్డుల సంగీతం పాడయిన ఏంప్లిఫయర్ల్లోంచి. సందిచివుట్టూ పందిపిల్లలూ, పిల్లలూ. ఏవి మనిషి పిల్లలో, ఏది పంది సంతానమో తెలియకుండా నడుస్తూ పోయాను. బాగా జ్ఞాపకం లేదు వీరాస్వామి పాక ఎక్కడ ఉందో. ఇదే అని అనుకున్న చోట సన్నమిద్దె ఉంది. గేటుకి ఎర్రరంగు. ఇనప గేటు. వీధిలో గేటు. వెనక్కి తిరిగి పెళ్లిపందిరి దగ్గరగావెళ్లి నిలబడి చుట్టూ చూశాను. గాఢమైన రంగుల సిల్కుచీరలు, చాలా వేడిగా ఉంది. ఆరేళ్ల చిన్నారి, గట్టిగా లాగివేసిన జడలు రెండిట్నీ ఆకుపచ్చ రిబ్బన్లతో కట్టించుకుని, పందిరి చివర గాటకు ఆనుకుని వైరాగ్యంగా చూస్తూంది.

'వీరాస్వామి తాతయ్య తెలుసునా?' అని అడిగాను.

చూపు మరల్చి, నా వేపు జాగ్రత్తగాచూస్తూ అంది: 'పైసియ్యి.' చెంపదెబ్బ తిన్నట్లనిపించింది. జేబులోంచి ఒక కాయిన్ తీసి యిచ్చాను.

మెరిసే తెల్లటి అర్ధరూపాయిని చిన్నచేతితో పట్టుకుని, రెండువేపుల్లా అటూ యిటూ తిప్పి, చూసి, హఠాత్తుగా ఏదో జ్ఞాపకం వచ్చినట్లు, వెనక్కి తిరిగి పందిపిల్లల్ని తన్నుకుంటూ, తోసుకుంటూ, సగం చీకటి సందులోకి పారిపోయింది. రెండు జడలూ, చైతన్యం వచ్చినట్లు యిటూ అటూ నవ్వుతూ ఎగురుతూంటే, సిల్కు పరికిణీ చుట్టూ నాట్యం చేస్తూంటే, చీకట్లోకి అదృశ్యం అయిపోయింది.

ఇస్త్రీ చేసిన గళ్ల లుంగీ వ్యక్తి ఒకడు నా

దగ్గరగావచ్చి అనుమానంగా చూశాడు నావేపు, చివ్వాం పారిపోయిన సందు చివరవేపు.

వీరాస్వామిని గురించి అడిగాను.

ఎవరికి ఎవరు కావలా అని హోరుపెట్తోంది రికార్డు. చుట్టూ గోలలో, వెక్కివెక్కి ఏడుస్తున్నట్లు పాటపాడుతూంటే, తనని తాను వెక్కిరించుకుంటున్నట్లు ధ్వని వినిపిస్తోంది.

కొబ్బరిచెట్లు వెన్నెలలో తల ఊపుతుంటే, ఎవరికి ఎవరూ కావలా లేరనో ఉన్నారనో వెక్కివెక్కి ఏడుస్తూంటే, మనుషులు సందుల్లో కసిగా కళ్లలో అప్పుడప్పుడు బాదుతూంటే, ఎర్రి గళ్లలుంగీ వ్యక్తి వీరాస్వామి గురించి చెప్పాడు.

బర్మా ప్రభుత్వం చిన్నప్పుడు వీరాస్వామి సాహసానికి మెడల్ యిచ్చింది. కాని ఆ పేటని కాల్చిన దావానలంలో వీరాస్వామి ఏడుమందిని రక్షించినా, రక్షిస్తూ వాళ్లంతా కాలి మసి అయిపోయారు.

'బతికున్నప్పుడు గిరగాడని ఒగ్గేసినాం, చచ్చి బస్మం అయ్యాక అన్నీ తెలుసుకొని రోజనేదు. పట్టుమని మువ్వయి ఏళ్లనేవు?' అన్నాడు, ఎర్రటి కళ్లల్లో కన్నీరు కదులుతుంటే.

గంగ అవతలిఒడున దీపాలు ఒకటీ ఒకటీ వెలుగుతున్నాయి. వరానంగా, నీలిగా ప్రవహిస్తోంది గంగ.

ఇక్కడనుంచి కూడా వెళ్లిపోవాలి. 'వృత్తి' పదును పోయింది. యాత్రికుగారి, ఈ సంధ్య వెలుగులో—ధూళితో నిండిన బాట తెల్లగా, మన్నితంగా తెలియని దూరంలోకి అదృశ్య మవుతోంది.

'ఆలోచనకి' 'తెలుసుకోడాని'కి మధ్య అఖాతం, 'ఆలోచిస్తే' 'తెలియదు'. 'తెలియడానికి' ఏమిటి చెయ్యడం?

'జెన్' మార్కు ఒకటుంది, 'మాండో' రూపంలో. టకటకమని వేసిన ప్రశ్నలకు తకాతకామని యిచ్చిన జవాబులు 'మాండో'లు.

'సీసాలో బాతుఉంది. చంపకుండా, గాయం తగలకుండా ఎలా తీస్తావ్?'

'ఆలోచించి' లాభంలేదు. దానికి ఒకటే జవాబు: 'అదిగో, అదిగో! పైకి వచ్చేసింది!' ఆశ్చర్యార్థకాలు అక్కర్లేదు. 'ఆలోచనకి' 'తెలుసుకోడాని'కి మధ్య ఉన్న అఖాతాన్ని వంతెనవేసి దాటలేవు.

ఒక్కసారి గెంతాలి. దుమికితే, దుముక కలిగితే బాతు పైకి వచ్చేస్తుంది. గెంత గలిగితే 'తెలుసు' కుంటావు. కాని మానవమాత్రులకు సాధ్యమేనా?

వలయాలన్నీ దాటుకుని వెళ్తూంటే దూరంగా అదృశ్యమవుతున్న బాట చివరకు వస్తూంటే, అఖాతం దగ్గరవుతున్న కొద్దీ, జ్ఞాపకాలు, ఆలోచనలు, జ్ఞాపకాల భారాలు, ఆలోచనల గాయములు తేలికయి, బలహీనం అయి, అఖాతంలో హోరుపెట్టే జలపాతం తెలుపులు, మరగం తెలుపులు రాళ్లమీద హోరు, వినిపిస్తుంటే, కనిపిస్తుంటే, చెవులో యీ అఖాతం భయంగా ఆనందంగా గర్జిస్తూంటే, అఖాతం అంచు దగ్గరకు వచ్చినప్పుడు అవతల ఒడ్డుకి గెంతి వేయగలననీ, మానవమాత్రుణ్ణి కాదననీ....

కాని, కాని...అసలు మానవుడేనా అని కూడా, కూడా అనిపిస్తూనే ఉంది, లోపల లోలోపల ఎంతో లోతుల్లో......

—



# పేరుబొట్ల చిదంబరకవి - శ్రీరామకుమారవిజయము

శ్రీ కొమాండూరి రామానుజాచార్యులు

ఈ కవి గంగానిర్ఝరధారావేగముతో 'శ్రీ రమాధీశ్వరు శ్రీకంఠ వినుతు' గొలిచి 'రామకుమార విజయాభిధానంబను' కుశలవ చరిత్రము మూఁడాశ్వాసములు—'కోమలఫణితి(తో) చిరకీర్తిలవభాతి చెప్పిన రచన' తెలుగున నకలంకశబ్దార్థమైన 'ద్విపద'లో 'ప్రబంధంబుగ రచించి - శశివిభకీర్తి'యగు—దశరథ రామునకు నంకితముగ నిచ్చి — భక్తకవిముక్తాహార హీరమణియగు పోతనాది భాగవతులవలె—ఇమ్మనుజేశ్వ రాధము లిచ్చు పురంబులు వాహనంబులు పుచ్చుకొనక దిశలందు కీర్తి వెలుగంగ తేజరిల్లినాఁడు.

## నివాసము—కాలము

ఈ కవి నివాసము నిర్ణయించుటకుఁగల యాధారము లెవ్వియు మృగ్యము. ఇందలి భాష - ఆచారవ్యవహారాదికముల ననుసరించి—పరిశీలింపగ— నెల్లూరు మండలాంతర్గత జనపద నివాసియని—తెలి సెడి యయ్యెడిని. పరిశీలకులు నిర్ణయించి తెలిపిన— సంతసింతును. కాలమును నిర్ణయించుటకుఁ దగిన యాధారము లెవ్వియు కానరాలేదు. ఈ యముద్రిత ప్రతిని నా కొసంగిన శ్రీ కనుమర్ల సింహాద్రిశర్మ గారు—తమ పితృపాదు లెవరికడనో తాళపత్రము నుండి—యుద్ధరించికొనిరనియు—కాని నేటికీ కవి యీ శిలావిభూతిని మారుసంవత్సరములకుఁ బూర్వము అలంకరించియుండెనని తెలిపిరట. ప్రస్తుత మీ కొమరు నకు నప్తతి వసంతములు గడచినవి. ఇదంతయు పరిశీలింపగా క్రీ. శ. పదునెనిమిద శతాబ్ది యుత్తరార్థము వాఁడని తోఁచుచున్నది. కావ్యమందలి పలుకుబళ్ళు, రచనావిధానము, శబ్దములు—ఈ యూహకు — తం యూపుచున్నవి.

## కులగోత్రాదికములు

ఈకవి 'రామనామ హారికృపాలబ్ధ సంస్కృతాంధ్ర సత్కవితారహస్యనిదు డను — భారద్వాజపవిత్ర గోత్ర శుభావస్తంబసూత్రుఁడను — 'పదవాక్యవిధి' 'ప్రుచిరపాలంకారరూపులు మెచ్చ — కావ్యములు రచించు—పండితుఁడను' అని తన సొంత గొప్పదనమును కొంత చాటికొనినాఁడు. ఇంతే తన వంశమందలి— పితామహ ప్రపితామహులను — వంశోత్కర్షను — అతివేలముగ వర్ణించినాఁడు. శ్రీరామపద భక్తి నిరతుని ప్రఖ్యాతయశుని — సదయాంతరంగుని సద సద్వివేక—పరిచితసుజ్ఞాన భాసురానంద - పరిపూర్ణ హృదయుని—బహుకళానిధియైన— నారాయణాఖ్యుఁడు— తండ్రియట. అనమాయకేనయగు నక్కమాంబ తల్లి యట. పరమ విఖ్యాతయశుఁడు 'భాగయార్యుఁడు' ఆచార్యుఁడట. వేదవేదాంగవిజ్ఞాని వేంకట నరసింహ సూరి - పితామహుఁడట. తాము నలువురు—అన్నదమ్ము లట. ఇంకను పీఠికలోని—విశేషముల పరిశీలించిన— కవివంశము — అతులోదాత్తమహత్వ వైదిక తప స్స్వాధ్యాయ దీక్షాకళాధృతి సంపన్నుఁగు — వైదిక భూసురప్రవరులని—అవగతమగుచున్నది. భూమికలో నీవిషయమును నిరూపించు స్ఫుటమగు కొన్నిపట్టులు లేకపోలేదు. 'సతతశ్రీ హరిభక్తి సంసక్తమతులనియు, 'అనుపమ మహిములనియు' శ్రీరామమహితపాదాబ్జసేవన నిరతులనియు—ఇత్యాదులు కలవు.

సామాన్యముగ కవులెల్లరు నీశ్వరోపాసకులై యుండి కావ్యములు రచించినట్లు — "దేవీంపాదముపో వలె... మురారిః కవిః" అన్న బంగారు పలుకు — కులుకుచునేయున్నదికదా! నాడేమి నేడేమి ఎల్లపుడు నంతియేకదా! కామేశ్వరీ కృపాలబ్ధ కవితా సామ్రాజ్య కవిసార్వభౌములగు తిరుపతి వేంకటకవులు — జగద్విదితులు కదా!

### కథావిధానము — ఇతివృత్తము

ఇందలి యితివృత్తము — ప్రఖ్యాతమైన 'కుశలవ కథ'. ఈ కథ సర్వులెరిగినది. ఇతనికి బూర్వులెందరో పద్య గద్య నాటక రూపములలో — సతులిత మాధురీ మహిమ రచించి — రసికుల పెదవుల తడిపినారు. ఈతడును — ఈ కథ ప్రఖ్యాతిని — పవిత్రతను — మధించి — వారికన్న మిన్నగ మెన్ననట్లు — పరమ భాగ్యముతో — విలక్షణముగ — పండితులకే గాక — పామరులకు ననుకూలముగ పాడికొనుటకు ద్విపదలో రచించి — సమకాలీనులలో — గౌరవము పొంది — సన్మానాలు — సభలు చేయించుకోవలయునను — ఉబలాటపడి — శ్రీకారము చుట్టినాడేమో? కాని యీ చిదంబర కవి జీవిత చరిత్రాదులవలెనే — కావ్యారంభ కావ్య నిర్మాణ చాతుర్యాదులలో నొక చిదంబర రహస్యమున్నది — 'సా(రు)రిభద్ర కపిత్థ పారిజాతాది — తరువయంబుల (చా) చేత ధన్యమైనదియు, వరమునంచే నొప్పి — సర్వకాలంబు — ధరనియు ఇక్ష్వాకు ధరణీశ్వరులందు — మునియుక్త కోటులు ముదమొప్ప చేసినదియు, భరత మార్కండేయ కౌలస్త్య ఋచిక, మరవరాని నారద శుక భరద్వాజ, శౌనకాది వరాని సంఘమ్ములు - నైమిశారణ్యమున సత్రయాగంబను — సత్క్రతు వొకటి, చిత్ర తరంబుగ చేయుచు నుండి — సకల పురాణార్థ సంవిత్ప్రభవుండగు సూతుండు — పురాణ ప్రవచనము గావించుచుండ వారిని వీక్షించిన — ఋషితండము (ఆశ్వాసము. 1)

'కలినాశ భారత కథ చెప్పునపుడు
వరగ పార్థుడు బభ్రువాహను పోరు
పోరుకు వల రామభూమీశు కుశుల
పోరంటి ఘనఘాత్మ! పుత్రుని తోడ
ఘనుడు రాముడు పోర కారణంబేమి'

యనియడుగగా సూతుడు కథా కథనమున కుపక్రమించినాడట. పూర్వ కవులవలె కావ్యావతారిక సమము చేసియు — ననేకమైన మార్పులు — కూర్పులు తీర్పులు — తీర్చినాడు.

### కథాకథనము — బాగోగులు

తొలి యాశ్వాసపు పూర్వార్థమున — రామోదంత మంతయు సంగ్రహముగ — పూసగ్రుచ్చినట్లు చిక్కగ చక్కగ చెప్పినాడు తరువాత చాకలివాని వదరుబోతు తనముతో సౌమిత్రి — భాగీరథీ తటమున — భూజాతను విడిచివచ్చుట — మున్నగు విషయములు — యథాతథముగ — కథ బాగుగా కతలో — లేఖిని నడపినాడు. కవి కావ్యమును — కమనీయముగ నడుపుట — ప్రధానముగ నెంచికొనక — పురాణములలో వలె — చిన్న చిన్న విశీర్ణ కథా సూక్తికములను — ఒక కావ్యమాత్రిమును — గుది గ్రుచ్చి — శారదా కంఠహార మణిగా గావింప యత్నించినాడు. కవి యాశయము — సంతోషింపదగినదే. నిర్మాణచాతుర్యము మున్ముందు — సార్థకత నొందినదని చెప్పలేము. పైగ — ఈ యాశ్వాసమునందు — కావ్యమునకు వలయు సామగ్రిని ప్రోదిచేసి — బీజావాపమొనర్చినాడు. కథను నడుపు దుడుకులులేని శైలిలో — పల్లెరుపై ఇండినడక వలె నడుపేల చతురుడు. కలము కూలంకషమై — యురవళ్ల పరవళ్ల తొక్కింపగలడు. ఇట్లీయాశ్వాసమునకు — భరత వాక్యము పలికి మలి యాశ్వాసమునకు — ఒక యపౌచిత్యముతో నాంది ప్రస్తావనము చేసినాడు. దీని కాధారము నా దృష్టింతవరకు నాధారము చిక్కలేదు. సాకల్యమేమని తీర్పువిచ్చునో అరయువలసి యున్నది... సౌమిత్రి గంగాతీరమున — విడిచి మరలిన పిమ్మట — సీతాదేవి తనకేర్పడిన — యాపదకు — పవరి వవరి తలచికొని — యొగలు బొగులుచు — తుదకు — ప్రాణ పరిత్యాగమునకు — సంసిద్ధమగుచుండగ నవనిజ కడకు,

గంగయు నిజరూపకలితయై వచ్చి।
నెత్తురా ప్రమొక్కు జానకివెత్తి।
కంటలేని కన్నీరు కడు ప్రీతి తుడిచి।

సంపదానదలకు సీమరము లేదెపుడు।
పొంపిరి వమ్మము పోవును ముందు

వని యూరడించంగ నంతయు వీత 'చెలువనింతటి కష్టంబు వింతలోకంబు చింతింపగలయేచెలువ జీవించు' ననవుడు-జాహ్నవి జానకిం గాంచి- నంతమయంతుల వృత్తాంతమును చెప్పి — శకుంతలా వృత్తాంతమంతయు పూసగుచ్చిన చందమున బోధమొనర్చును. ఇదియిట నెంతవరకు, కవి యౌచిత్యమును పోషించినాడో— సహృదయ రసికలోకము నిర్ణయించుముగాక.

లోకమున కవులు తమ కావ్యములలో—పూర్వ కథను ఉత్తరకథతో పోల్చిచెప్పుట నా చూచినంతలో నీ కవిదే యగ్రతాంబూలము. ఈ కవియేల నీ విపరీతత్వ ప్రదర్శనమునకు కడంగెనో యవగతముగాదు. పైగ నీ కథయైనను వేదములోనిది-బ్రాహ్మణములోనిదియు కాదు. కొంత భారతములోనిది. కొంత కవికుల గురుని అభిజ్ఞాన శాకుంతల నాటకము లోనిది. కొంత తనయూహకదంపు దువన్యాసము. కొన్ని యుదాహరణములు. కవి కుల తిలకుని-శాకుంతలమున— అంగుళీయకము, శక్రావతార తీర్థమున స్నానమాడుచుండగ - వ్రేలినుండి జారిపడినట్లుండగా— ఇందు తల్లి తనయుని కీయ నది—నదిలో పడినట్లున్నది. అటులనే భారతమునందు వలెనే-శకుంతల తన పురావృత్తాంత మార్యంతమును - తానే యేకరువు పెట్టికొనుచు తన దుర్భర దౌర్భాగ్యమునకు - తానే వెందించికొనును. నాటకమందువలెగాక—భారత కథ యందువలె - తనయునితోనే అంతఃపురమున కేగును. ఇట్లు కవి-కాళిదాసుని కవిత్వము కొంత-నా పైత్యము, కొంత యున్నట్లనేకములైన మార్పులు చేయవలసిన యవసరమేమో— ఆ చిదంబరరహస్యము— ఆ చిదంబర కవికే తెలియవలయును.

ఇట్టి పట్టులు పరిశీలించినపుడు—రుచిరపాక కార రూఢులు మెచ్చ, కోమలఫణితికావ్యములు చెప్ప గల నవెడి విశేషణము—కేవలము పేరుబిరుదాయనంటిదే యగును. పైన తనను గూర్చి-'పదవాక్యనిధి'నవియు 'ఘనసంస్కృతాంధ్ర కవితారహస్యవిమల'నవియు చెప్పికొని నదియు — శుష్కవచ్యాసమనియే చెప్పవలసి యుండును. ఈకవియు కొంత యుబలాటపడి కావ్యమునకు శ్రీకారము చుట్టినాఁడు. అయిన నొక్క విశేషము గమనింపతగినదియున్నది. కావ్యాంతమునందు-పరిమర్శముగ-పరిశీలించినవారికి నితఁడు తనకు పూర్వులు- సమకాలీనులు రచించిన-పలుకావ్యములను చదివిన వాఁడని మాత్రము చెప్పవచ్చును. కావ్యస్వరూపమునే- మరచి-ఇతివృత్తమునే విస్మరించి - వర్ణనానైశర్యములతో— రచనావిరగంతతో అయాంబా ఇతరవిశేషములతో - 'సర్కసుఫీట్లు' చూపిన—ప్రబంధకవుల కోవకు చేరిన దీకావ్యము. కవియు నా కోవకు చెందిన వాడు కాకున్న-ఉదాత్తమైన యితివృత్తమును వీరరసప్రధానమైనదియు గైకొని-ఇంత విస్తారమైన- ద్విపదకావ్యరచనకు ముందంజవైచునా? అట్లని ద్విపదకావ్యములన్నియు విస్తారములై నవికావు. గౌరన, రంగనాథుఁడు, అభినవకవిత్రయము వారి ద్విపద భారతము-మున్నగు కృతులెన్నియో-వ్రేళ్లపై లెక్కింపవచ్చును. పైగ కవులు కొంతమంది ఈ వాఙ్మయమును హేళనచేసిరి. "ద్విపదకావ్యంబు ముదిలంజ తిద్దికంత". (పోలిపెద్ది వేంకటరాయకవి 'వేణుగోపాల శతకము.)

ఇఁక ప్రథమాశ్వాసాంతమున రాముడు

"మునివశిష్ఠునకు మ్రొక్కి ముదమొప్పఁబలికె
మనకులోద్భవులెల్ల మహి నశ్వమేధ
మొనరించి విఖ్యాతినొందిరిగాన
ననుఁ బంద నా(నా) చేత నమ్మఖ క్రతువు
ననఘాత్మ చేయింపు"

ముని ప్రస్తుతించిన వృత్తాంతమునకు కొన్ని యూకలు తోకలు తగిలించి-రెండవ యాశ్వాసముదాక లాగుకొని వచ్చినాఁడు. ఈ యాశ్వాసముననె-అశ్వమేధాశ్వమును వదలుట-తదుపయాయిగ విశ్వశత్రుఘ్నుడను శత్రుఘ్నుడు వెంబడించుట-అది పల్లెలు పట్టణములు— పరిభ్రమించి-పరిసరారణ్యములతిగమించి, కలుగు తావసి వసికూన ఆశ్రమప్రాంతమునకువచ్చుట—ఋషిబాలకులద్దాని రాకను గని-కుతుకకుదెల్పుట— వారలదద్దాని పట్టిగట్టివేయుట—వ్రహ్మచారు లీవృత్తాంతమును

ఆశ్రమమందున్న—సీతాదేవికిఁ దెలియఁజేయుటవరకుఁ గల కథను—రమణీయార్థప్రతిపాదకశబ్దములతో పరమవిలక్షణముగ వశీకృతజన హృదయాహ్లాదకరముగ పలుకుపొంకముగ-నడిపినాడు.

ఇటనుండి తృతీయాశ్వాస మారంభమగును. ఇట కుశలవులకు రామలక్ష్మణ భరతశత్రుఘ్నాదులకు నడచిన—భీషణసంగ్రామమును—సముచితవాగ్విన్యాసములతో—వీరరసప్రధానమగు ఘట్టమగుట - ఔచిత్యముగ వర్ణించినాఁడు. సమయమునకుఁదగిన — శబ్దముల నుపయోగించుచు — హృద్యాతిహృద్యముగ — వర్ణించినాఁడు. కవి తన శక్తి సామర్థ్యము లిట కొంతవరకు వ్యక్తీకరించినాడు. ఘన సంస్కృతాంధ్ర కవితా రచనజ్ఞతను—మొక్కపోనీయ రేదని-ఇటమాత్రము కొంతవరకు చెప్పవచ్చును.

కాని యిందాటువడ్డ యనౌచిత్యము మాత్రము-మెడపట్టుకొనినెట్టినను—మారుపట్టుకొని ప్రేలాడినట్లు - అట నట-తొంగి చూచుచునే యున్నది. కొన్ని ప్రదేశములో కొంత మోతాదు హెచ్చు లొచ్చు అంతమాత్రమే. అందు కుదాహరణగ ఇట అర్థము పర్థములేని-ఆరు పేజీల యైతిహ్యము నొకదానిని జొనిపినాఁడు. ఆ కథ యిట నప్రస్తుతమని తోచెడిని - సారాంశమిది.

పూర్వ విరోధమును సాధించుటకై—ఇంద్రుడు రాజునకు శాపవృత్తాంతముఁ దెలియనీయక - ఉమా వనమ్ములో తానమాడగనె రాజునకు స్త్రీత్వము ప్రాప్తింపగ నొక ఋషి కుమారుఁడు (క్షత్రియస్త్రీయయిన, నాతని వలచి-వలపించి - యామెయందు మువ్వుర సుతులను బడసినపిదప - శాపవైరములు - తీరగనే-రాజు పూర్వరూపమునొంది—స్వరాజ్యమునకు వచ్చి—తన వృత్తాంతమును—తనయులకుఁ దెలియఁబరచి వారలకును రాజ్యభాగమిమ్మనగ—వారియ్యకొనమి-ఇరువురు నింద్ర ప్రేరితులై—భయంకర సంగ్రామము కావింప—నందు—స్వకళత్రజనితనందను లెల్లరు-పంచత్వమునొందగా —పుత్రశోక జనితాకులభీతవిషణ్ణచిత్తయై—నగల బోగులు—రాజమహిషికి — శాపవృత్తాంతముఁ జెప్పి—ఇంద్రుడు తనయు లందరిని బ్రతికించి—యామె కోరిన వరములిచ్చుట యనున దీకథ. ఈ కథను—కుశలవులు రాఘవులకుఁ జరిగిన—యుద్ధ సందర్భమున —'కన్న బిడ్డలవిగాంచ కలిగిన ప్రేమతో పితరుఁడుమండఁగ—మందాకిని—'విజయాన కలితయై వచ్చి' చెప్పియూరడింపును. రామాయణగాథ ఎప్పుడు జరిగినది? వంగ దేశమందలి యీ కథా వృత్తాంత మెప్పుడు జరిగినది? నక్కయెక్కడ? నాగలోకమెక్కడ? ఇట్టి యసందర్భములనేల నుపయోగించెనో? యెరుగరాదు. ఇట్టి విరుద్ధములను - తీసివైచిన చో తను దొలఁ దొలఁ జెప్పినట్లు—'చిరకీర్తి తపతరాతి చెప్పిన రచనము ఛాయామాత్రముగ పలుకుబడికమున — తెలుగు తీరు తీయములతో తన గబ్బులగంటమును కదను త్రొక్కించినాఁడని బల్లగుద్ది చెప్పవచ్చును. కవికి తన కావ్యము - మూలమున—ఆర్ష ధర్మములను వాటి సంప్రదాయములను-సాంఘిక స్థితిగతులను—తెలియఁజెప్ప వలయునన్న తలంపు కలవాడుగనే కనపడుచున్నాడు. తాను కవినని-పండితుడనని—లోకములో నింతపేరు ప్రఖ్యాతులు సంపాదించికోవలయుననెడి— యుబలాటము మిక్కుటముగ—కలవాడు.

కావ్యమునకు మంగళాంతము గావించు—(యుద్ధ సన్నద్ధులు సమసిన వెంటనే)—వాల్మీకులు కుశలవులను - రాముడులకు పరిచయ మొనర్చి—స్వీకొనుమనిచెప్పి యొసగినారు. అశ్వమేధాధ్వరము పూర్తి చేయుటకు—వాల్మీకిని రాముడాహ్వానించినాడు. కూడా సీతాదేవియు మరల నయోధ్యకు వచ్చెను. పుత్రులను మిత్రులను-కోడలినిగాంచి-కౌసల్యాదులు పరమానందము చెందినారు. తరువాత యజ్ఞము పూర్తి యగును. కొంతకాలమునకు—కుశునకు రాజ్యాభిషేకము చేయుచు—

రామచంద్రునిరీతి రమణీయరీతి
కుశ నీవు పాలింపు కుశలతమెరసి
విశదభక్తిగ నీతి వెలయ మామతులు
నిను గొల్చియుందురు నిక్కమీమాట
యనవుడు భరతుని యందరు బొగడ
ననఘాత్ముడగు కుశుఁడంత తండ్రులకు
వినయనంభరితుడై వెన్మొక్కుటయు.

అని పూర్తిచేసినాఁడు. సరి యొప్పువంకలు తిరిగినను 'నదులకు సాగరంబె గతివా' నుడిగ మంగళాంతము

మాత్రము స్వకమముగ– "రామకుమారవిజయము" గావించినాఁడు.

ఈ కావ్యమున 'వాతాంబుపర్ణాశన' వంటి యమకరణలు, జాతీయములు–సామెతలు–కోకొల్లలుగ మున్నవి. అంతగా భావచౌర్యము కనుపడదు. చక్కగా యంత్యప్రాసలు పోతనవలె వేయఁగలఁడు. కమనీయ మగు శైలిలో కలము నడుపుటలో నీతఁడు పూర్వ కవులకే మాత్రములు దీసిపోవువాఁడు మాత్రముకాఁడు. వాల్గ్వద్వద లుపాయనముగ గొని యానందింపుఁడు.

"నారాయణుఁడు దివ్యనామ మొప్పార
ధారుణీనాయకు తనయులయందు
చతురర్థములఁగాఁగ చతురుఁడై పుట్టి
యతిశక్తి తాటక నరుదారఁగొట్టి
కౌశికు జన్నంబు కడముట్టఁగాంచి
భాసిల్లు జనకుని భవనంబు మెట్టి
తనరారు శంకరు ధను వెక్కుపెట్టి
జనకు నిచే పట్టి జనవాధు పట్టి
సాకేతపురి త్రోవ చ...నపట్టి
సాకారిమెచ్చంగ భార్గవరాము
భరారి గర్వమడంచి పురి ప్రవేశించి"

ఇట్లు చక్కగా కావ్యమును నడపును. ఈ కావ్యము తాళపత్రమునుండి–ఉద్ధృతమైనది. దీని కాపీ యొకటి ఆంధ్రసాహిత్యపరిషత్కార్యాలయమందు న్నట్లు శ్రీ దేశోద్ధారకులచేత సంకలితమైన – ముద్రితాముద్రిత గ్రంథ సర్వస్వపట్టిక తెలుపు చున్నది. ఒక అజ్ఞాతుఁడైనకవి జీవితము లోకము నకుఁ దెలియఁజేయు తలంపున–శిథిలమైన నీ గ్రంథ మును–శ్రమైకసాధ్యములో చూచి - ఈ నాల్గు మాటలు వ్రాసినాను–గుణాగుణములు గ్రహింపునది. సాత్కలోకము ఇంకను దీనికి సంబంధించిన–వివర ములు తెలిపిన–కృతజ్ఞతతో స్వీకరింతును. ఈ గ్రంథమున సుమారు 70 పేజీ లున్నవి.

ఈ వ్యాసమునకు - అతని వాక్యములతోనే భరత వాక్యము పలుకుచున్నాను.

'మనసంస్కృతాంధ్ర సత్కవితారహస్య
విదుఁడు భారద్వాజవిమలగోత్రజుఁడు
పదవాక్యవిధి చిదంబరకవీంద్రుండు
రుచిరసాలంకారభూషలు మెచ్చ
రచియించినట్టి 'శ్రీరామకుమార
విజయప్రబంధంబు'–విభుడై నరాము
విజయకీర్తి రీతి–విశ్వంబునందు
ధర సార్కవిధులున్న కాలంబురాఁక

బరగు నా శ్వానంబు మూఁడవదగుచు
మొప్పె, అని కావ్యమును పూర్తిచేసినాఁడు.

ఈ కవి యితర కావ్యము లెవ్వియు మున్నట్లు కనుపడలేదు. కాని ఈ గ్రంథము చివర–భాగవత ద్వాదశ స్కంధములలోని సారమును–పన్నెండు పద్య ములలో వ్రాసినాడు.

'శ్రీ రుచిక ప్రజాపతికి
శ్రీపతి బుట్టుట, అత్రి, దక్ష న
చ్చారు కథల్ ధ్రువోన్నతియు
నత్పృథుడో హరిగాంచుటాధరా
భారము మాన్పి ప్రోచుటయు
ప్రాచినబర్హి ప్రచేతనూన్పతుల్
వారలు బొందు ముక్తి పరి
పాటి పురంజయు మో చతుర్థావా.'
వారిజనే(తృ) త్రు కృష్ణ ప్రభ
వంబును బాలచరిత్ర కంస సం
హారము రుక్మిణీ పరిణ
యంబు నవేక సతీవిహారముల్
వారల పుత్ర సంఖ్య శిశు
పాల మురాసుర శంబరాదులఁ
జీరుట శిరివర్య మృగ
ధీరుచరిత్ర కుచేలుచర్య నూ
క్ష్మరుహ సంగ్రహంబు జన
క్రపణపంబు దశప్రబంధవా॥
ఇట్లు పన్నెండు పద్యములును రచించి–కడను–
భామర నీలశైల హరిభక్తి
'చిదంబర' సత్కవీందుడుఁ
వాశిగ చెప్పె నీ విమల
భాగవతార్థ కథామృతంబు యు
గ్మాసిత వృత్తమాలికయు
భక్తి పఠించిన వ్రా(శ)సెవేనియుఁ
వ్యాపకు నవ్వ భాగవత
భవ్య ఫలంబులు హరి కయ్యెడుఁ॥

# సాహిత్య విమర్శ స్వరూపము

## శ్రీ ఆర్. ఎస్. సుదర్శనం

విమర్శ అంటే చక్కగా తెలుసుకోవటం. సాహిత్యాన్నిగూర్చి చక్కగా తెలుసుకోవటం రెండు విధాలుగా ఉంటున్నది. ఒకటి: రచనల్ని సాముదాయికంగా పరిశీలిస్తూ సాహిత్య తత్వాన్నిగూర్చి దానిలక్షణాల్ని గూర్చి విచారించి తెలుసుకోవటం. రెండు: ఒక నిర్దిష్ట రచనను గూర్చి తెలుసుకోవటం. మొదటి రకమైన సాహిత్య విమర్శ తెలుగులో సాంప్రదాయికంగా సంస్కృతంనుంచీ వచ్చింది. అప్పకవీయంలాంటి అలంకార శాస్త్ర గ్రంథాలు తెలుగులో సాహిత్య విమర్శకు ఒరవడి పెట్టాయి. ఒక నిర్దిష్ట రచనను గూర్చి తెలుసుకోవటానికి అలంకారశాస్త్రం ఎంతవరకు పనికివస్తుంది? అనే ప్రశ్నకు సమాధానం వెతుక్కోవటంలోనే సంప్రదాయ ప్రియులకూ ఆధునికులకూ భేదాభిప్రాయం రావటానికి అవకాశం ఉన్నది.

ఒక కాలానికి అందుబాటులోవున్న గ్రంథ సముదాయాన్ని లక్ష్యంగా పెట్టుకొని లక్షణం నిర్వచింపబడుతుంది. ఈ లక్షణనిర్వచనంలో సాహిత్య ప్రక్రియలనుగూర్చిన వింగడింపేకాకుండా, మరీ సూక్ష్మమైన భేదాలవరకూ విచారణ సాగటం ఉన్నది. ఉదాహరణకు నాయక నాయికాభేదాలు, భాషలో ఉక్తివైచిత్రి భేదాలు అటువంటివి. ఈ విచారణని ఆధారంగా పెట్టుకొని రచయితలు రచన సాగిస్తారు. సాగించారు. అలంకార శాస్త్రానికి ఏ మాత్రపు విలువ యివ్వాలి? అనే ప్రశ్న ఉన్నది. ఇది రచయితను ఎదుర్కొనే ముఖ్యప్రశ్న. అలంకార శాస్త్రం అధిగమించరాని సాహిత్య సత్యాలనే చెబుతున్నదన్న భ్రమలో పడి అందులో చెప్పబడిన ప్రతిఅంశాన్నీ తు. చ. తప్పకుండా అనుసరించవలెననుకోవడంవల్ల తెలుగులో సాహిత్య వికాసం కొరవడిన దృష్టాంతాలూ ఉన్నాయి. అలాగే అలంకార శాస్త్ర పరిధిలో పూర్తిగా ఇముడని రచనల విషయంలో వాటి సాహిత్య ప్రతిపత్తిని గూర్చి వివాదాలు సంభవించటమూ ఉన్నది. అలంకార శాస్త్రంయొక్క పుట్టుకనుగూర్చీ, ప్రయోజనాన్నిగూర్చీ మన వాళ్లలో సరియైన దృక్పథంలేకపోవడమే యిందుకు కారణమని తోస్తుంది. సంస్కృతంలో అలంకారశాస్త్రం ప్రతిపాదించిన ఔచిత్యము, రసము, ధ్వనివంటి విచారణమార్గాలూ ఒక కోవకు చెందినవి. అవి ఒక నిర్దిష్ట రచనను గూర్చి తెలుసుకోవటానికి పనికి వచ్చేవే అనుకుందాము. కాని నాయక నాయికా విభేదాలవంటివీ, గుణదోషాల పట్టికలూ, పైగా తెలుగువాళ్ళు అలంకార శాస్త్రానికి పెట్టుకున్న చిలవలూ పలవలూ పూర్తిగా కాలదోషంపట్టిపోయాయి. ఇలా అలంకార శాస్త్రంలో పనికివచ్చే భాగాన్నీ, పనికిరాని భాగాన్నీ ఎప్పటికప్పుడు విడమర్చుకోవటంకూడా సాహిత్య విమర్శలో ముఖ్యాంశమే!

ఔచిత్యము, రసము, ధ్వని అనే సాంప్రదాయిక మార్గాలని తీసుకున్నా వీటిని ఒక నిర్దిష్ట రచనకి అన్వయించటంలో ఎంతో క్లిష్టత ఉన్నది. ఔచిత్యనిర్ణయము పూర్తిగా విమర్శకుని సంస్కారంమీదా, సహృదయత మీదా ఆధారపడి ఉంటుంది. ఇక్కడే జీవితానుభవమూ, జీవితంపట్ల వివేచనాదృష్టీ, వివిధ విషయానుశీలనా, అభినివేశమూ, అవగాహనా విమర్శకునికి అవసరం అనేవిషయం గుర్తుకు వస్తుంది. 'రసము' విషయంలోనూ, ఆ పదాన్ని ప్రయోగిస్తున్నప్పుడు, తను ఏ అర్థంలో ప్రయోగిస్తున్నాడో నేటి విమర్శకుడు నిర్వచించి చెప్పటం ముఖ్యం. 'రసవంతంగావుంది', 'రసపోషణ జరిగింది,' లేక

రసాభాసమైంది,' 'రసభంగం జరిగింది' అని ఊరికే ఆ పదాన్ని వాడటంలో అస్పష్టత తప్ప మరేమీ ఉండటంలేదు. విమర్శకునికి ఏదో సంతృప్తి కలిగింది, లేకపోతే అసంతృప్తి కలిగింది అని మూఢంగా తప్ప మరేమీ తెలియటంలేదు. ఒక నిర్దిష్ట రచనని తీసుకున్నప్పుడు అందులో కలిగిన సంతృప్తి లేక అసంతృప్తి యొక్క లక్షణం ఏమిటో ఆ రచనకు అన్వయిస్తూ నిరూపించనంతవరకు పై రకం అధికారిక వాక్యాలూ, తీర్పులూ అర్థరహితంగానే ఉంటాయి! నామటుకు నాకు 'రసము' అంటే 'Unity of Mood' అని అన్వయించుకో వచ్చునేమో అని తోస్తుంది. ఒక విశిష్టమైన మనఃస్థితిని వాళ్లో కలిగించగల రచనని, రచనాభాగాన్ని లేక వాక్యాన్ని రసవంతమైందిగా చెప్పవచ్చు. ఇక్కడ మనఃస్థితి అంటే ఒక హృదయానుభూతే కాదు, దానికి అనుబంధమై మేథాగతమైన విశేషతావస్ఫురణకూడా అని ఉద్దేశం. 'శృంగారరసం' అనగానే స్త్రీపురుషుల మధ్య లైంగిక వ్యాపారం మాత్రమేకాదు. ఆ స్త్రీపురుషుల ప్రత్యేక వ్యక్తిత్వాలూ, ఆ వ్యక్తిత్వాల సంఘర్షణా, సమీకరణా, కథా సందర్భమూ, ఆ సందర్భానికి ఆ రచన మొత్తంమీద నిర్దేశితమైన అర్థమూ 'ప్రయోజనమూ'—అన్నీ వివరించుకోవలసిన, అన్వయించుకోవలసిన అవశ్యకత ఉన్నది. ఈ విశ్లేషణమూ నిరూపణమూ లేనప్పుడు 'శృంగార రసము'ని ప్రతి స్త్రీపురుషుల సన్నివేశాన్నీ, పేర్కొనటం సాహిత్య విమర్శ కాదు. ఒక ఉదాహరణ: ప్రసిద్ధమైన 'మనుచరిత్ర' కావ్యంలోని వరూధినీ ప్రవరుల ఘట్టాన్ని శృంగారఘట్టంగా గుర్తించి ఆ ఘట్టంలో శృంగార రసాభాసము జరిగినట్లుగా పేర్కొని, అంతకంటె పైన ఆలోచించలేక పోవటం, అన్వయించుకోలేక పోవటం— ఆ కావ్యానికి విమర్శ ఎలా అవుతుంది? వరూధిని వ్యక్తిత్వాన్నీ, ప్రవరుని వ్యక్తిత్వాన్నీ సవ్యంగా అర్థం చేసుకోవడమేకాదు, ఆ కావ్యం మొత్తంమీద ఆ ఘట్టంలో జరిగిన రసాభాసానికి ఉన్న ప్రయోజనం, ఔచిత్యం కూడా విమర్శకుడు అర్థం చేసుకోవలసిన అవసరం ఉన్నది. అసలు 'మనుచరిత్ర'ని శృంగారరస ప్రధాన కావ్యమని ఎందుకనుకోవాలి? కావ్యం ధార్మికుడూ, వైదికుడూ అయిన ప్రవరుడు లోకాతీతుడైన ఒక సిద్ధపురుషుని కలుసుకోవటంతో ప్రారంభం అయిందికదా! ధర్మానికీ కామానికీ గల సంబంధం, సంఘర్షణ ఆ కావ్యవస్తువులో ఒక అంశం మాత్రమే! ధర్మానికీ కామానికీ చివరకు అన్ని పురుషార్థాలకూ సమన్వయం సూచించే ఆ కావ్యంయొక్క పరమార్థం కావ్యం అంతా పరిశీలిస్తేనే, దాని రచనాపద్ధతిని అవగాహన చేసుకుంటేనే బోధపడుతుంది! ఆ కావ్యంలో శృంగారం గౌణమేతప్ప ప్రధానరసం కాదు: ప్రధానమైనది శాంతము—శాంతంలోవున్న విశిష్టత ఇతర రసాలన్నీ దానిలో అంతర్భూతం కావటం. వరూధినీ ప్రవరుల సంవాదఘట్టంలో శృంగారరసాన్ని ఆభాసం చేసి తద్ద్వారా తన కావ్యధ్యేయానికి దాన్ని ఉపయోగించుకోవటం పెద్దన చేసినపని. ఈ విషయం గ్రహింపుకు రావాలంటే పెద్దన దృక్పథాన్ని గూర్చి తెలుసుకునే ఆకాంక్ష వుండాలి: కావ్యాన్ని సమగ్రంగా సాంతం నమ్రతతో, శ్రద్ధతో పరిశీలించే మనస్తత్వమూ కావాలి.

చెప్పవచ్చిందేమిటంటే ఔచిత్యము, రసము, ధ్వనివంటి ఊతకర్రలు చేతపుచ్చుకున్నా, అవి కాళ్లకు అడ్డంవచ్చి పడిపోకుండా ఉండేందుకు కొంత నేర్పూ, ముందుకు నడిచే శక్తీ, క్రొత్తదనాన్ని చూచేందుకు చూపూ వ్యక్తిగా విమర్శకుడికి ఉండాలి. లేకపోతే ప్రయోజనంలేదు. అలంకారశాస్త్ర పరిజ్ఞానం ఒక నిర్దిష్ట రచన విషయంలో విమర్శకునికి ఎంత సహాయకారిగా ఉండవచ్చునో అంత ప్రతిబంధకంగా కూడా ఉండగలదనే విషయం స్పష్టమే! అయినప్పుడు ఒక నిర్దిష్ట రచన విషయంలో సాక్షాత్తూ విమర్శ ఎలా జరుగుతుందో విచారించడం ద్వారానే సాహిత్య విమర్శ స్వరూపం తేల్చుకోవాలిగాని, అది అలంకారశాస్త్రం ద్వారా తేలే విషయం కాదు!

## 2

విమర్శకుని ప్రథమ కర్తవ్యం రచనను చదివి అడుగడుగునా అవగాహన చేసుకుని దాన్ని సమగ్రంగా

దృష్టిపథంలో నిలుపుకోవడమనే సూత్రాన్ని అందరూ అంగీకరిస్తారు.[1] 'రచన చెయ్యడమంటే ఆలోచిస్తూ ముందుకు సాగిపోవటం. అది ఒక అన్వేషణ. రచయిత వెళ్ళినదారినే వెళ్ళటం, అతని అన్వేషణనే తనూ చేపట్టడం విమర్శకుడు చెయ్యవలసినపని. రచయిత చీకట్లో, మసకవెల్తుర్లో దారి వెతుక్కుంటూ వెళ్ళివుండొచ్చు. విమర్శకుడు ఆ దారినే దీపం చేత బుచ్చుకుని వెళ్తాడన్నమాట. ఇంకోవిధంగా చెప్పాలంటే కావ్యం భవనంలాంటిది. దాని నిర్మాణం నమ్మగా వుండాలి. పై కప్పు కురుస్తున్నదా, మెట్లు గట్టిగా వున్నాయా, గదులేవైనా తెరవడానికి వీల్లేకుండా తాళం వేయబడ్డాయా, మొదలైన విషయాలన్నీ గమనించి తెలుసుకొని వివరించి చెప్పడం విమర్శకుని వంతు' అంటాడు యూజెన్ అయొనెస్కో అనే రచయిత.[2] రచనను అవగాహన, ఆకళింపు చేసుకోవడమన్నది ఇక్కడ రెండు విధాలుగా వర్ణించబడింది. విమర్శకుడు రచయితలో చేసే ప్రయాణంగా, రచయిత నిర్మించిన భవనంలో ప్రవేశించడంగా. అంటే విమర్శకుడు రచన చదివి దాన్ని దృష్టిపథంలో నిలుపుకోవడంతో, అతనికి రచనస్వరూపం (Form) దృశ్యం కావాలి.[3] ఆ స్వరూపం ఒకప్రయాణంగా (A movement) గా కాని, ఒక నిర్మాణం (Structure) గా గాని ఉండవచ్చు. ఈ రెండు రూపాలూ ప్రస్తుతం విమర్శకులు ఎక్కువగా ఉపయోగిస్తున్న గుర్తులు; ఒకటి కాలానికి (Time) సంబంధించినది, రెండోది 'దేశాని'కి (Space) సంబంధించినది. ('ప్రయాణం' బదులు, ప్రవాహం', 'భవనం' బదులు 'పువ్వు' గుర్తులు కావచ్చు.) ఇక్కడే ముఖ్యంగా గమనించవలసిన విషయం ఒకటున్నది. ఒక రచనను మొదటినుంచి చివరిదాకా ఎంతగా అధ్యయనం చేసినా దాని సమగ్ర స్వరూపం మనోనేత్రంముందు స్ఫురించకపోతేమాత్రం లాభం లేదు. ఆ రచనయొక్క 'కదలిక' లేక 'నిర్మాణం' తాలూకు ఏకత్వం దేనిమీద ఆధారపడిఉన్నదో ఆ రహస్యాన్ని విమర్శకుడు పట్టుకోవాలి. అది సద్యః స్ఫురణగాగాని, విస్తృతమూ నిశితమూ అయిన పరిశీలన ఫలితంగాగాని జరుగవచ్చు. అలా జరిగినప్పుడే విమర్శకునికి రచన నిర్మాణంలో ప్రతి భాగమూ అంశమూ పరస్పరం అమరివున్నాయో లేదో బోధపడి, రచనా స్వరూపాన్ని విశ్లేషించి నిరూపించడానికి వీలవుతుంది. పైకి కనిపించే వైరుధ్యాలనీ, అసంబద్ధతనీ అధిగమించిన ఏకత్వమూ, విశేషార్థమూ రచనలో ఏదైనా ఉన్నదో లేదో అన్వేషించడం, నిరూ

---

1. "...In Arnold's conception of criticism...the important thing is 'to see the object as in itself it really is." (C. S. Lewis: An experiment in criticism. Page. 119.)

"There is nothing more that can be usefully said about a novel until we have fastened upon the question of its making and explored it to some purpose...to study the craft, to follow the process, to read constructively..."
(Percy Lubbock: The Craft of Fiction quoted by D. Daiches: Critical Approaches to Literature: Page 288.)

"His (the critics) first concern is to enter into possession of the given poem in its concrete fullness, and his constant concern is never to lose his complete possession but rather to increase it." (F. R. Leavis: quoted by D. Daiches: Critical Appoaches: Page 299)

"He (a good critic) must be an adept at experiencing, without eccentricities, the state of mind relevant to the work of art he is judging"

(1. A. Richards: The Principles of Literary Criticism: Page 114)

2. Engene Ionesco: The Writer and his Problems: Encounter.

3. "It (Form) is the shape that the whole takes when every part has fallen into its place according to the design which the artist had in his mind throughout." (Scott James: The Making of Litt. Page. 305)

పించడం జరుగుతుందన్నమాట. అప్పుడు రచనలోని లోపాలు లేక విశేషాలు అవే వ్యక్తం అవుతాయి. ఇక్కడ రచన సౌష్ఠవాన్ని, విశిష్ఠతనూ నిరూపించ డానికి అలంకారశాస్త్రంకాని, తదితర సిద్ధాంతాలుగాని విమర్శకునికి కొలబద్ద కారాదు. అలంకార శాస్త్ర పరిజ్ఞానమూ, తదితరములూ విమర్శకుని అవగాహనా శక్తిని వృద్ధిచేసి తోడ్పడవచ్చుగాని, రచనయొక్క స్వరూప, వైశిష్ట్య నిర్ణయంలోమాత్రం ప్రమాణం కారాదు! 'Nothing can perman'ntly please which does not contain in itself the reason why it is so, and not other wise' (coleridge). ఒక రచన యిచ్చే ఆనందమూ, దాని విలువా దాని నిర్మాణంలో అంతర్గతమైన ఒకానొక మూలకారణంమీదే ఆధారపడకుండా, దానికి సంబంధించని ఏదో యితర కారణంమీద ఆధారపడితే, ఆ ఆనందమూ, విలువా తాత్కాలికమైన భ్రమమాత్రమేనని, దాన్ని వ్యక్తం చేసిన విమర్శ సాహిత్య విమర్శకాదని కోలరిడ్జ్ భావము. ఒక రచనయొక్క పథకమూ, దాని నిర్మాణ సూత్రాలూ దాని స్వరూపం దర్శించడం ద్వారా విమర్శకుడు ఆ రచనమంచే గ్రహించవలసి ఉంటుంది. ఎవరో ఎక్కడో ఏ రచనను గురించో సిద్ధాంతీకరించిన సూత్రాలను ప్రస్తుత రచనకు అన్వయించబూనటం విమర్శకాదు![4] విమర్శకుడు రచన స్వరూపాన్ని దర్శించి దాన్నిగూర్చి చేయబూనుకున్న విశ్లేషణాత్మక విచారణద్వారానే రచనలోని లోపాలు బహిర్గతమౌతాయి. ఈ విచారణే రచన విలువని నిర్ణయిస్తుంది.[5] అప్పుడు విమర్శకుడు ప్రత్యేకంగా తీర్పు చెప్పవలసిన అవసరం కూడా ఉండదు. రచనలో వాచ్యమైన అభిప్రాయాలతో తను ఏకీభవిస్తున్నాడో లేదోకూడా విమర్శకుడు చెప్పవలసిన మాట కాదు. రచనను గూర్చి చక్కగా తెలిసికోవటమూ తెలియచెప్పటమూ విమర్శకుని ఏకైకలక్ష్యం. 'Description ought to be his only form of judgement; criticism is the registering of the reality of a work, of its logic; it is a task of verification and confirmation' (Ionesco).

అయితే రచన స్వరూపంలో సౌష్ఠవమూ సౌందర్యమూ అన్వేషించి నిరూపించడంతప్ప విమర్శ చెయ్యవలసిందేమీ లేదా? అంటే అవును, అంతటితో ఆగిపోవటమే కర్తవ్యమని కొందరి అభిమతం. వీరినే Formalists అంటున్నారు. అలాకాదు సాహిత్యపరంగా ఎన్నదగిన రచనకు, అది ప్రాచీనమైనా అధునాతనమైనా, దానికి సమకాలీన జీవనంతో, భావసంచలనంతో ఉన్న సంబంధాన్నిగూర్చి వ్యాఖ్యానించడంకూడా విమర్శధ్యేయమేనని మిగిలినవారంటున్నారు.[6] సాహిత్యపరంగా ఎన్నదగిన రచన

---

4. The defects of a work are due to that in it which is not in confirmity with itself; to the fact that the work departs from the rules, and therefore from itself; each work is important in so far as it invents its own rules." (Eugene Ionesco : The Writer and this Problems: Encounter.

5. "The axioms and postulates of criticism have to grow out of the art it deals with...Critical principles cannot be taken over ready made from thealogy, philosophy, politics, science, or any combination of these."

(Northrop Frye : Anatomy of Criticism Page 6.)

A work is bad when it is not itself, when it does not amount to something like a unique being or entity ...The mistakes in a given work, the useless parts are those parts which do not belong to it."

(Eugene Ionesco : The Writer and his Problems : Encounter.)

6. "Any criticism that is not purely preoccupied with technical matters must be concerned to bring out the basic moral concern, the implied valuation of human attitudes and activities that gives life to a work of art" (John Mander : The Writer and Commitment Page 23.)

తప్పుకుండా జీవితంపట్ల ఒక దృక్పథాన్ని వ్యక్తం చేస్తూ వుండాలని వీరి అభిప్రాయము. నిర్మాణ సౌష్ఠవం సాధించిన ఒక అపరాధ పరిశోధక నవల సంగతేమిటి? అంటే దానికి సాహిత్యపరంగా విలువ తక్కువేననీ, జీవితంపట్ల ఒకదృష్టినీ ఒకవ్యాఖ్యానాన్నీ వ్యక్తం చేయగలిగిన రచనమాత్రమే సాహిత్యపరంగా ఉత్కృష్టమైందనీ వీరి అభిప్రాయం. ఈ అభిప్రాయాన్ని మనం ఆమోదిస్తే విమర్శ చేయవలసిన పనుల్లో రచనయొక్క దృక్పథాన్ని గూర్చిన వ్యాఖ్యానం కూడా ఒకటి అని తేలుతుంది. ఈ వ్యాఖ్యానం విమర్శకునిబట్టి కావ్యంయొక్క వ్యంగ్య వైభవాన్నిబట్టి ఎన్నోవిధాలుగా వుండటానికి వీలున్నది. ఒక నవలనో నాటకాన్నో తీసుకున్నప్పుడు అందులోని పాత్రలనుబట్టి యీ వ్యాఖ్యాన పరంపర వుండవచ్చు. ఈ రకం విమర్శ మనకు బాగా పరిచితమైనదే. కాని పాత్రలమీద విడివిడిగా వ్యాఖ్యానించటంకాక రచన మొత్తంమీద వ్యక్తమయ్యే దృక్పథం ఏమిటో దాన్ని రూపొందింప జేయటం ఆధునికపద్ధతి. ఉదాహరణకు; షేక్స్పియర్ హామ్లెట్ పాత్రను గూర్చిన వ్యాఖ్యానాలు కోకొల్లలుగా వున్నాయి. హామ్లెట్‌పాత్ర ఒక తీరని సమస్య. కాని ఆ పాత్రబదులు నాటకాన్ని మొత్తంగా తీసుకొని ఆ రచన స్వరూపాన్ని దర్శించినప్పుడు హామ్లెట్‌పాత్ర సమస్యగా కన్పించదు. దానికి బదులు ఒక అపూర్వ జీవిత దృక్పథం గోచరిస్తుంది. ఒక కావ్యంయొక్క దృక్పథాన్నిగూర్చి వ్యాఖ్యానించే విమర్శ మన సంప్రదాయంలో సకృత్తు. బహుశా లేదనే అనుకుంటాము. అందుకు కారణం సులభంగానే ఊహించవచ్చు. ప్రాచీన కావ్యాల్లో దృక్పథం వైదిక దర్శనాలమీదా స్మృతులమీదా ఆధారపడిందే అయి ఉండటంవల్ల ప్రత్యేకంగా దాన్నిగూర్చి వ్యాఖ్యానించే అవసరం అప్పటికి కన్పించి ఉండదు. కాని నాముటుకు నాకు శంకరుడు ఉపనిషత్తులకూ గీతకూ అద్వైత దృక్పథరూపంలో చేసిన వ్యాఖ్యానమే ఒక గొప్ప సాహిత్య విమర్శగా కన్పిస్తుంది. ప్రాచీన కావ్యాల్లోనూ, వస్తువు కల్పితమూ, లేక ఇతిహాసికమూ అయినప్పుడు కథా వైశిష్ట్యాన్నిబట్టి పాత్రల వైవిధ్యాన్నిబట్టి వ్యాఖ్యానానికి అవకాశం ఎంతో వున్నది. కాని నాయకనాయికా భేదాలంటూ సాముదాయిక సాహిత్య లక్షణ గ్రంథాల్లో పాత్రలను సిద్ధాంతీకరించివెయ్యటంలో ఆ అవకాశం వినియోగం కాకుండా ఒక ఆంక్షలాంటిది విధింపబడింది. తెలుగు సాహిత్య విమర్శలో యీ అంశము తొలగించి కావ్యాల్లో పాత్రపోషణకూ యథార్థజీవితానికీ గల సంబంధాన్ని వ్యాఖ్యానిస్తూ చక్కని విమర్శ వెలయించినవారు శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారు. ఆ విధంగా తెలుగులో మనకు ఒక క్రొత్త సంప్రదాయం ఏర్పడింది. ఆధునిక విమర్శకు శ్రీకారం చుట్టబడింది. కాని నిజానికి ప్రాచీన కావ్యాల విషయంలోగాని, తెలుగులో ఉత్తమప్రబంధాల విషయంలోగాని ఒక నిర్దిష్టకావ్యంలో ఆ రచన మొత్తంమీద వ్యక్తమయ్యే దృక్పథాన్నిగూర్చి వ్యాఖ్యానించేందుకు ఉన్న అవకాశం మనం యింకా ఉపయోగించుకోవటంలేదు. 'కళాపూర్ణోదయం'లో కథానిర్మాణసౌందర్యమూ, పాత్రల వైవిధ్యమే కాకుండా, ఆ రచన వ్యక్తంచేస్తున్న దృక్పథంలో కూడా ఎంతో వైశిష్ట్యం ఉన్నది. ఈ దృక్పథాన్ని గూర్చి శ్రీ కాటూరి వేంకటేశ్వరరావుగారు కొంత వ్యాఖ్యానించారు. అలాగే 'మనుచరిత్ర'లో వ్యక్తమౌతున్న దృక్పథాన్నిగూర్చి నేను చేసిన వ్యాఖ్యానము లోగడ 'భారతి' (1963) లో ప్రచురింపబడి, యిప్పుడు 'సాహిత్యంలో దృక్పథాలు' అన్న సంపుటిలో ముద్రితమై ఉన్నది. ఇక్కడ చెప్పవచ్చిందేమిటంటే మన ప్రాచీనకావ్యాల్లో జీవిత దృక్పథాన్నిగూర్చి క్రొత్తగా వ్యాఖ్యానించేందుకు ఏమీ లేదనుకోవటం పొరపాటు. ఒక కావ్యం జీవితచిత్రణ చేస్తున్నప్పుడు లేక విశిష్టమైన కల్పనగా, యితిహాసంగా, పురాణంగా అది సరేసరే మనల్ని ఆకర్షిస్తున్నప్పుడు రసవంతంగా ఉంటున్నప్పుడు (అంటే ఒక విశేష మనః

ప్రీతిని మనలో కలిగించే శక్తి కలిగివున్నప్పుడు) ఆ రససిద్ధిని గూర్చి విశ్లేషణాత్మకంగా వివరించ బూనుకోవటమేకాదు, దానికీ జీవితానికీ గల సంబంధాన్ని గూర్చి వ్యాఖ్యానించటంకూడా విమర్శ చేపట్టవలసిన లక్ష్యమే!

ఇక్కడ ఒక మాట చెప్పవలసి ఉన్నది. నేటి విమర్శకుడు వెలయించే వ్యాఖ్యానమే ఒక ఉత్తమ కావ్యానికి భరతవాక్యం కానేరదు. అలా అయ్యే పరిస్థితివుంటే ఆ కావ్యంయొక్క జీవితం అంతటితో పరిసమాప్తి చెందిందనే అనుకోవచ్చు. అప్పుడు కావ్యాన్ని చదివినా విమర్శ చదివినా ఒకటే అవుతుంది! రచయిత దృక్పథమూ అతని కాలపు విశ్వాసాలూ వాచ్యంగాకాక, కావ్యంలో వ్యంగ్యంగా, జీవిత చిత్రణంగా నిక్షిప్తం కావటంతో ఆ కావ్యం విశ్వజనీనమైన, కాలాతీతమైన ఒక సత్యాన్ని వ్యక్తం చెయ్యడం జరుగుతుంది.[7] ఆ సత్యాన్నే ఆ కావ్యం యొక్క ఆత్మగా, ప్రాణంగా పేర్కొనవచ్చు. ఆ సత్యాన్ని కావ్యంలోని దృక్పథంగా, కావ్యం యొక్క విశేషార్థంగా, రసధ్వనిగా ఏ యుగపు విమర్శకులు ఆ యుగంలో వ్యాఖ్యానించవచ్చు, దర్శించవచ్చు. కావ్యం నాలుగు కాలాలపాటు నిత్యనూతనంగా ఉండటం ఆ విధంగానే సాధ్యం.

పైన వివరించిన 'ప్రాణ' లక్షణం దృష్ట్యా, ఏ ఉత్తమ కావ్యానికిగాని చరమ విమర్శ అంటూ ఉండడం అసంభవమని గుర్తించక తప్పదు. గొప్ప కావ్యాల్లోని గాంభీర్యము, ఉదాత్తత వాటిలో ఏదో ఎవరికీ అర్థంకాని విషయం కొంత ఉంటూ ఉండటం వల్ల ఏర్పడిందికాదు; ఆ కావ్యాలనుంచి అర్థవైవిధ్యమూ, అనుభూతి సంపదా పుష్కలంగా లభించే అవకాశం ఉండడంవలన, భిన్నప్రకృతులుగల పాఠకులందరికీ భిన్నవిధాలలో రససిద్ధి కలుగుతూ ఉంటుంది[8]. దీన్ని గమనించి విమర్శకుడు నిస్పృహ చెందవలసిన పనిలేదు. విమర్శ అంటే 'చక్కగా తెలుసుకోవటం' అంటూ ఈ ప్రసంగం ప్రారంభించాను. కాని ఒక కావ్యాన్ని గూర్చి ఏమిటి 'చక్కగా తెలుసుకోవటం'? అని నిశితంగా ప్రశ్నిస్తే దానికి సమాధానంగా కావ్యం ద్వారా కలిగిన అనుభూతిని మాత్రమేనని గుర్తిస్తాము! కాని విమర్శకుడు తనుచేసే వివరణలో నేలవిడిచి సాము చెయ్యకుండా రచనని ఎప్పటికప్పుడు ఉపాధిగా అంటిపెట్టుకునే వ్యవహరించాలి అనే నియమం ఉన్నది. అదే సాహిత్య విమర్శకు గీటురాయి.

కాలంలో అభిరుచులూ అభిప్రాయాలూ మారుతాయి. సాహిత్య రచనలో మార్పులూ కొత్తపోకడలూ వస్తాయి. సాహిత్యాన్ని విమర్శించి వ్యాఖ్యానించే మార్గాలూ భిన్నంగా రూపొందవచ్చు. కాని రచయిత దృక్పథానికీ అతని రచనకీగల సంబంధం ఒక నిశ్చిత ప్రమాణం. రచన మనలో కలిగించే అనుభూతిద్వారా ఆ సంబంధాన్ని తెలుసుకొని వివరించడానికిచేసే ప్రయత్నమే సాహిత్య విమర్శ. సాహిత్య విమర్శ స్వభావము కావ్యార్థ ప్రకాశము; దాని స్వరూపము సత్యాన్వేషణము.

(హైదరాబాదులో జరిగిన నాల్గవ అఖిల భారత తెలుగు రచయితల మహాసభల్లో 'సాహిత్య విమర్శ'నుగూర్చిన అధ్యక్షోపన్యాసం.)

---

7: The work of imagination presents us with a vision not of the personal greatness of the poet, but of something impersonal and far greater; the vision of a decisive act of spiritual freedom, the vision of the recreation of man.

(N. Frye: Anatomy of Criticism: Page 94.)

8. The mystery in the greatness of King Lear or Macbeth comes not from concealment but from revelation, not from something unknown or unknowable in the work but rom something unlimited in it. (N. Frye: Anatomy of Criticism: Page 88).

# గ్రంథ విమర్శలు

## శ్రీ అరవిందుని పురుషోత్తమ తత్త్వము

(కర్త: శతావధాని వేలూరి శివరామశాస్త్రి, ప్రకాశకులు: సాధన గ్రంథమండలి–తెనాలి. క్రౌను 1/8, పేజీలు 84: వెల రు. 1–50.)

సాధన గ్రంథమండలి సార్థకనామ మగునట్లు ప్రచురించుచున్న గ్రంథములలో ఇది 101 వది.

అరవిందుల సర్వతంత్రము ఇత్యాదిగా భారతిలో పూజ్యులగు శ్రీ వేలూరు శివరామశాస్త్రిగారు ప్రచురించిన 7 వ్యాసముల సంపుటము ఇది. చివరిదగు 'ఋత–చిత్' శ్రీ శాస్త్రిగారు ప్రకటించిన తుది వ్యాసమగుటచే వారియందు గౌరవము కలవారికి చింతాస్మృతులు కలిగించుచున్నది.

అరవిందులు మొదట విప్లవ వీరుడనియు తుదకు మహాయోగియనియు ప్రసిద్ధి కెక్కిరి. కాని నిజమాలోచించినచో ఆయన మొదటినుండి తుది వరకు మహాకవియే. ఈ మాట ఎఱిగినవారు కొది మంది. ఆయన 'సావిత్రి' ప్రపంచ ఖ్యాతి నొందిన దాంతె కృతి 'డివైనా కమ్మీడియా' వంటి మహా కావ్యకోటి నలంకరించునది. తన యశేష విద్వత్తును యోగానుభవమును ఆ మహాకావ్యములో రూపొందించుటకు ఆయన ఎంతయో శ్రమించెను. ఆ కావ్యమును పాతికేళ్లపాటు పునః పునః మార్పులు చేయుచు జీవితము చివరి సంవత్సరములలో దానిని పూర్తి చేయుటకు కొంత తొందరపాటుకూడ ప్రదర్శించెను. 'సావిత్రి' చివర, దానినిగూర్చి విమర్శనలు సూచనలు చేసిన ఆప్తులకు ఆయన వ్రాసిన లేఖలు కొన్ని ప్రచురింపబడినవి. అవి చదివిన వారికి ఆయన తన కావ్యమును, ఎంత నిశితముగా పరిశీలించుకొనుచుండెనో, గ్రీకు, లాటిను, ఆంగ్ల, ఫ్రెంచి, ఇటాలియను, జర్మను మహాకవుల కావ్య సౌందర్యములు, వాదులు ఎంత వాచోవిధేయముగా వారికి ఉండెడివో విశదమగును. ఆయన యాశయము దాంతె ఇత్యాదుల నతిక్రమించి వేదఋషుల స్థానమును పొందవలెననునట్లుగా గోచరించును. అది ఎంతవరకు సాధించిరో చెప్పుట సాధ్యముకాదు. కాని దాంతె, మిల్టను మహాకవుల స్థాయిని కావ్య నిర్మాణములో అతిక్రమించినట్లు మాత్రము ధైర్యముగా చెప్పవచ్చును. వ్యాస వాల్మీకులు అలవోకగా మధురోదాత్తముగ ప్రసరింపజేయు ప్రసన్న వాక్కును మాత్రము ఆయన అందుకొనలేదు. విశ్వ విజ్ఞానమును, దేశదేశములలో కాలాంతరములలో ఉన్న యోగాది సాధనలను గ్రహించి, వానిని జీర్ణము చేసికొని, సమన్వయించుకొని, సర్వ సులభమైన నూతన యోగమునకు ప్రవక్త కావలెనను తీవ్ర సంకల్పము ఆయనలో ప్రజ్వరిల్లుచుండెను. ఆయనకు గురువు లేడు, స్వయమాచార్యుడు. యోగములు దర్శనములు కూడ సంప్రదాయ మార్గమున గాక స్వయంకృషివలన తెలిసికొనినవాడు. ఆయన విస్తారోజ్జ్వల విద్వత్తు, నిశితబుద్ధి పరులయందు ప్రమాణబుద్ధి కలుగుటకు ప్రతిబంధకముగా నుండెను. ఆయన సర్వసత్యమును దర్శింపలేదనుటకు, ఆయన రచనలలో ప్రసన్నత లేకపోవుటయే నిదర్శనము. నేటి మహాసంక్షోభములోనుండి ఎప్పటికైనను నవ్య దర్శనము రూపొందగలయెడల, నిస్సందేహముగా దానికి బీజావాపము చేసిన మహాపురుషుడుగా భావికాలమున నాయన పరిగణింపబడగలడు. సర్వదర్శనకర్తగా, అరవిందులు సిద్ధి నొందలేకపోయినను, అందులకై ఆయన చేసిన కృషి, సాధనలు సావిత్రీకావ్యమునకు విశ్వ సాహిత్యములో మహోన్నతస్థానమును సాధించిననుట కెట్టి సందేహమును లేదు. అరవిందుల దర్శనములనే గ్రంథజాలములో వారి కవితా శక్తి దర్శించు

వారే అద్భుతభావన లందుకొనగలరు కాని. కేవల దర్శనముగా భావించువారికి మృగతృష్ణలోని జలము మాత్రమే లభింపగలదు.

అరవిందుల సంస్కృతి, గ్రీకు, ఆంగ్లాది పాశ్చాత్య వాఙ్మయములతో ప్రారంభమై, ప్రాచ్య భూములలోని సంస్కృతాది భాషలందలి వేదవేదాంత దర్శన తంత్ర కావ్యాదికములతో పరిణతి నొందినది. ఈ గ్రంథము రచించిన శివరామశాస్త్రిగారు ముందు సంస్కృతమునను, వేదవేదాంతాది దర్శనములందును స్వయంకృషిచే విద్వాంసులై, ఆ పిమ్మట ఆంగ్లభాష ద్వారా విశ్వవిజ్ఞానమును ఆకళించుకొనుటకు పరిశ్రమించినవారు. అరవిందుల సంస్కృతి పశ్చిమమునుండి ప్రాచీముఖముగా ప్రసరింపగా, శ్రీ శాస్త్రిగారిది పూర్వమునుండి పశ్చిమముఖముగా ప్రసరించినది. ఈ విధముగా భావించినచో శ్రీ అరవిందుల తత్త్వమును ఆంధ్రులకు ప్రదర్శించుటకు శ్రీ శివరామ శాస్త్రిగారికంటె ఉత్తమాధికారులు దొరకుట దుర్లభ మనిపించును.

ప్రకాశకులు శ్రీ బులుసువారు కృతజ్ఞతాంజలిలో 'ఈ గ్రంథమునందలి మొదటి మూడు వ్యాసములలోను శ్రీ అరవిందుల వేదాంతమును అరటిపండు ఒలిచి చేతిలో పెట్టినట్లు చెప్పగా వివరించిరి.... అతిమానసతత్త్వాన్వేషణ తత్పరులైన యోగమార్గానుయాయులకు ఈ పురుషోత్తమ యోగము కరదీపికవలె ఉపయోగించుననుటకు సందియము లేదు' అనిరి. (పే. 6) కాని ఈ గ్రంథము శ్రద్ధగా పఠించినవారు ప్రకాశకులభావముతో ఏకీభవించుట కష్టతరము. ఈ వ్యాసము లవగాహనము కాకపోవుటకు కారణము శ్రీ శాస్త్రిగారి శ్రద్ధాలోపముకాని శక్తిలోపముకాని కాదు. మూల విషయములోనే దురవగాహత మూర్తీభవించియున్నది.

'శ్రీ అరవిందుల పూర్ణయోగం అనే సముద్రంలో తంత్రం, వేదాంతం అనే నదులు మరి పెక్కునదులతోపాటు సంక్రమించినై. ఆ సరిత్సాగర సంగమ స్థలంలో ఒక కొత్తక్షేత్రం తలచూపింది' అని గ్రంథారంభము చేసినారు. కొంత దూరముపోయి, 'అరవిందుల సాధనలో ప్రకృతి పురుషోభయసాధనలు కలిసినై. ఈ సాధనకు ఫలం కేవల ముక్తికాని కేవలభుక్తికానీ కాదు. ఇది ఒక కొత్త లక్ష్యానికి బాటవేసింది. ఇది ప్రకృతినే రూపాంతరంగా మార్చివేయడం.' (పే. 6) అన్నారు. తర్వాత, 'అరవిందుల సవ్యతంత్రంలో లేక పూర్ణయోగంలో—మూలాధారంలోని కుండలినిని మేలుకొలపడం అవశ్యకంకాదు. పైగా అనావశ్యకం. ఎంచేతనంటె ఆ పూర్ణయోగంలోని సాధన, తంత్ర సాధనలోని మొదటిమెట్టుకంటె పై మెట్టు నించి మొదలు' (పే. 7) అన్నారు. మరికొంత తర్వాత, ప్రకృతి సంపూర్ణంగా మారిపోయినప్పుడు సచ్చిదానందం ఏ సమాధిలోనో కాదు, ఏ శివలోకంలోనో కాదు, ఏ కైవల్యంలోనో కాదు, మరి ఇహలోకంలోనే నిండారా అవతరిస్తుంది. అప్పుడు సాధకుని శరీరంలో ప్రకృతి సహజములని అనుకొనబడే చావు పుట్టు మొదలయిన ధర్మాలుండవు... సకృతిని ప్రకృతినే మార్పు పొందించడమనే కొత్తలక్ష్యంద్వారా అరవిందుడొకానొక దివ్యతంత్రానికి ద్రష్ట అవాడు. కుంభకోణంయోగిఅని చెప్పబడే కంచుమర్తి వేంకాస్వామి రావుగారు (పి. వి. వి.) ఈ మార్పు పొలిమేరనూ మేరనూ సానపొన చూచారేమోఅని అనిపిస్తుంది—కొన్నికొన్ని భేదాలతో. అరవిందులసాధన తంత్రసాధన యొక్కయే ముందడుగు' (పే 9) అన్నారు. క్రింది గీతలు నావి.

పై వాక్యాలన్నీ సమన్వయిస్తే, అరవిందులు ప్రవచించిన యోగము ఇతఃపూర్వము ఋషులు గాని, జ్ఞానులుగాని, యోగులుగాని, మతప్రవక్తలు గాని, మతగ్రంథాలుగాని అందుకోలేకపోయిన మహార్థము సాధించినదనే ప్రతిపాదన కనబడుతున్నది. విజ్ఞాన శాస్త్రములో నూతన సత్యావిష్కరణము వైజ్ఞానికులు చేయునట్లు, యోగవిషయములో ఇది యొక కొత్త సత్యప్రదర్శన మన్నమాట. అందులో విశేషాతివిశేషము దీనివలన ఈ శరీరానికే చావు లేకుండా పోతుందనేదిగా మనము గ్రహింపవచ్చును.

ఇది చాలా ఆకర్షకమైన విషయమే, ముఖ్యంగా

ఈ కాలపువారికి త్రిశంకుమహారాజా సశరీరస్వర్గము వాంఛించి నానాయాతనలు పడ్డట్లు, ధర్మరాజా సశరీరంగా స్వర్గము చేరుకొనికూడా ఈ శరీరంతో స్వర్గసుఖమే అనుభవింపలేకపోయినట్లు పురాణకథలు విన్నాము. ఇంతా చేస్తే అది స్వర్గసుఖమే, పరిమిత మైన సుఖము! పురాణాలలోని చిరజీవుల జీవితా లకూ మితి ఉన్నది. అందరిలోనికి దీర్ఘాయుర్దాయ మున్నదనే బ్రహ్మకే కల్పాంతమైన ఆయుస్సే అని పురాణాలు చెప్పుచున్నవి. అరవిందుల తంత్ర మవ లంబించే యోగుల శరీరాలకు చావు లేకపోవడానికి పరిమితికూడా కవిపించదు.

అది అద్వైతులు చెప్పే జీవన్ముక్తివంటిది కాదు. జీవన్ముక్తుల శరీరాలు జీవ మున్నంతకాలము ప్రారబ్ధకర్మను అనుభవిస్తూనే ఉంటవిగదా!

ఇక లంబికాయోగాదులవలన వచ్చే కాయసిద్ధికి కూడా పరిమితి లేకపోలేదు. ఉన్నంతకాలమూ జీవ న్మృతస్థితివంటిదేకాని చైతన్యయుక్తమైనదికాదు.

అరవిందుల నవ్యయోగము అనుష్ఠించేవారికి జ్ఞానానందయుక్తమైన చిరజీవిత్వము ఈ శరీరాంకే ప్రసాదించునట్లాలె!

పురాణాలేకాక ఆధునిక విజ్ఞానశాస్త్రము కూడా ఈ భూగోళమే బుడగవలె చిట్లిపోవడమో, చల్లబడి చిదికిపోవడమో జరుగడము ఖాయమంటున్నది గదా! అప్పటినవ్యయోగుల చావులేని శరీరాలు ఏమవుతవి?

శ్రీ సి. వి. వి. గారి శిష్యులైన మా మిత్రు లొకరు తాను ఉపదేశము పొందేముందు వారిని శాశ్వతముగా జీవించడమంటే ఏమిటో వివరించమని కోరగా వారు, 'You will live with this body for ever' అని యుత్తర మిచ్చిరనియు, ఆ పిమ్మట తాను ఉపదేశము పొందితినియు అంత రంగిక గోష్ఠిలో తెలిపిరి. అప్పటికే శ్రీ సి. వి. వి. గారి దేహము మృత్యుగ్రస్తమైనది.

ఆ తర్వాత శ్రీ అరవిందుల శరీరము కూడ మృత్యుగ్రస్తమైనది కదా! కాబట్టి వారి సాధనవలన శరీరానికి చావు అనే ధర్మ ముండదనే మాటలో సత్యములేదని రుజువైనది. కాక అరవిందుల సిద్ధాంతమును శ్రీ శివరామశాస్త్రిగారి వంటి విద్వాం సులు కూడా అపార్థము చేసికొని రనవలెనా?— ఏ మాత్రము హేతువాదమందు విశ్వాసమున్నవారైనా, ఈ ప్రశ్న వేయకుండలేరు!

భరతఖండములో ఔపనిషద మతము వేద వేదాంత ప్రమాణముతో వర్ధిల్లినది. అది అద్వైత మునకే రూఢ్యర్థమున చెల్లుబాటవుచున్నది. వైశేషిక, న్యాయ, సాంఖ్య, యోగ, జైన, బౌద్ధాది మతములు పురుషప్రోక్త గ్రంథ వచనాదులపై నాధారపడినవి. అవి యన్నియు ద్వైతము లనదగినవి. ఇట్లుండగా క్రీస్తు 9 వ శతాబ్దములో వసుగుప్తునకు దొరకిన వనలదు శివసూత్రములను ఆధారముగా చేసికుని సోమానంద విరచితమైన శివదృష్టియను గ్రంథముతో ప్రారంభమై 52 శ్లోకములుగామన్న స్పందకారికల తోడను అనేక వ్యాఖ్యలు స్తోత్రగ్రంథములతో 12వ శతాబ్దమువరకు మత మొకటి వర్ధిల్లినది. దానిని త్రికమని, శైవమని నామాంతరములు. దానినే శ్రీ మాధవవిద్యారణ్యులు ప్రత్యభిజ్ఞాదర్శనమని వ్యవహరించిరి. దానిని భేదమును అభేదమును కాని భేదాభేద సిద్ధాంతమనుచున్నారు. దానిలో శివుడు, శక్తి, జీవుడు నిత్యులు. ఆ మూడిటి సమష్టి రూపమే త్రికము, పరశివుడు! ఆ పరశివ పరిణామమే ఈ లోకము. వారికి ఉపాస్యమైన దైవము కాళీదేవ తయేకాని శివుడుకాడు. వారి పరమశివుడును శైవుల శివుడు కాడు, పశుపతికాడు, పశుభావముకూడా కలసిన వాడనవలె.

ఇవికాక శివప్రోక్తములని చెప్పబడుచున్న తంత్రగ్రంథములెన్నో వెలసినవి. అవి ప్రధానముగా ఏదో ఒక దేవతను తన్మంత్రమును అవలంబించి వశ్య—ఆకర్షణ—విద్వేషణ—సమ్మోహన—ఉచ్చాటన—మారణము అనెడి షట్కర్మలను, రసాయనయోగ ములను ఇంద్రజాలికాది విద్యలను సాధించు విధా నముల నుపదేశించును.

12 వ శతాబ్దము తర్వాత అద్వైతము, ద్వైతము, ద్వైతాద్వైతము అభిమాన దైవతము

లనుబట్టి నానామతములుగా యత్కించిద్భేదములతో పరిణమించినవి.

వీనిలో త్రికస్పందమూలమైన ప్రత్యభిజ్ఞా దర్శనము ఉపాసనరూపముగా నేడు కానరాకున్నను, అభినవగుప్తపాదులు నాట్యశాస్త్రమునకు 'అభినవ భారతి' అను పేర వ్రాసిన ఉత్తమవ్యాఖ్యానలనను, ధ్వన్యాలోకమునకు 'లోచన'మనుపేర వ్రాసిన వ్యాఖ్యానలనను ఆలంకారికుల మతములలో స్థిరప్రతిష్ఠ సంపాదించుకొనినది. కవీశ్వరులగు అరవిందులు అభినవ గుప్తులవలనను వారిద్వారా త్రికసిద్ధాంతము వలనను ఎక్కువగా ప్రభావితులైరనుటకు ఎట్టి సందేహమును లేదు.

దానికి తోడు జీవకసిద్ధాంతములు, ఘూర్జర మహారాష్ట్రములలో వ్యాప్తికన్న నాథసంప్రదాయము వారి నాకర్షించినవి. మరియు టిబ్బతుదేశమందలి లామాసాధనలు వివిధబౌద్ధజైన తంత్రములు, సూఫీల సాధనలు, క్రైస్తవ మహాభక్తుల సాధనలు, బహుశః ఆఫ్రికాఖండవాసులయు అమెరికాలో ఆదిమ వాసులగు రెడిండియనులయు చిత్రవిచిత్ర సాధనలు వారు పఠించియుందురు. వీని యన్నిటికంటెను వారికి అభిమానపాత్రమైనవి గ్రీసుదేశములో క్రైస్తవ మతము బాగా వర్ధిల్లిన తర్వాతికాలములో కూడా సంప్రదాయము చెడక నిలిచి, విశేష సంస్కారముగల జ్యూలియను చక్రవర్తి వంటి మహావిద్వాంసులను గూడ ఆకర్షింపగలిగిన, (Eleusinian Mysteries) ఎల్యూసినియను మిస్టిరీలు అని నేడు పిలువబడుచున్న గోప్యమైన ఉపాసనలు. వాటినిగూర్చియే కొంత యీ కాలములో నెరుగుదురుగాని ఆ సంప్రదాయము నష్టమైనందున వాని నిజస్వరూపము ఎరిగినవారు లేరు. ఎవరి యూహాంకొలది వారు వాని స్వరూపమును చిత్రించుకొనుచున్నారు.

సావిత్రి పుస్త. 2 సర్గ. 8 (పే 281) లోని ఒక పంక్తిని అరవిందులు ఒక ఉత్తరములో ఇట్లు వ్యాఖ్యానించినారు :

Performs the ritual of her Mysteries. It is "Mysteries" with capital M and means "Mystic symbolic rites" as in the Orphic and Eleusinian "Mysteries". When written with capital M it does not mean mysterious things, but has this sense, e. g., a "Mystery play."

సావిత్రీకావ్యముపై నొక మిత్రుడు చేసిన విమర్శనలకు జవాబు వ్రాయుచు నొక ఉత్తరములో అరవిందులు ఇట్లు వ్రాసిరి.

"...In such a race of rapid transitions you cannot bind me down to a logical chain of figures or a classical monotone. The mystic Muse is more of an inspired Bacchante of the Dionysian wine than an orderly housewife.'

భావమును వ్యక్తీకరించుటకు శబ్దము ఎంత యుపయోగపడునో అంతమోసముకూడ చేయగలదు. ఆనందోబ్రహ్మ యన్న ప్రాదువు వరూధినికి ఒక విధముగా ప్రవరునికి మరొక విధముగా అన్వయించినది. వరూధిని వ్యాఖ్యానమునే నేడు తాంత్రికులకు ప్రధాన ప్రమాణ గ్రంథమైన పరశురామ కల్పసూత్రము ఈ విధముగా సూత్రీకరించినది. 'ఆనందం బ్రహ్మణోరూపమ్ — తచ్చ దేహే వ్యవస్థితమ్— తస్యాభివ్యంజకాః పంచ మకారాః—తై రర్చనం గుప్త్యా ప్రాకట్యా న్నిరయః.'

ఒకే శబ్దము వేరువేరు దర్శనాలలో సంప్రదాయాలలో వేరువేరు అర్థాలలో ప్రయోగింపబడుతుంది. ఒకే దర్శనంలో వేర్వేరు సందర్భాలలో అర్థభేదముంటుంది. ప్రపంచ వ్యాప్తమైన అనంత యోగ సాధనలనుగూర్చి అరవిందు లంత విస్తారపఠన మున్నవారు లేరు. శ్రీ శాస్త్రిగారన్నట్లు అరవిందుల పూర్ణయోగము పెక్కునదులు సంక్రమించిన సముద్రము. వారి శబ్దాలను శ్రీ శాస్త్రిగారు తమకు అందుబాటులోఉన్న శబ్దాంతో గ్రహించి అనువదించారు. అరవిందులు Over mind అంటే Super mind కాదు. అసలు Mind అనే పదానికి మనస్సు అనే శబ్దమే సరియైన పర్యాయ పదముకాదు. శాస్త్రీయపరిభాషలో మనస్సు బుద్ధి

వేర్వేరైనవి. Mind లో ఆ రెండు మాటల భావము ఇమిడిఉన్నది. ఋతంభరాప్రజ్ఞ అనేది పతంజలి యోగసూత్రములలో ఉన్నది. సబీజసమాధివలన గలుగు అనుభవమును ఋతంభరప్రజ్ఞయని సమాధి పాదములో సూత్రించినారు. శ్రీ అరవిందుల 'ఋత' అది కాదు. అరవిందుల యోగమును శ్రీ శాస్త్రిగారు పురుషోత్తమ తత్త్వమని వర్ణించినారు. పురుషోత్తమతత్త్వ మనగానే వేదాంతవాసన ఉన్న వారి కందరికీ భగవద్గీత పదునైదవ అధ్యాయములోని పురుషోత్తమ తత్త్వము స్ఫురిస్తుంది. ఆ పురుషోత్తముడు క్షరాక్షరులకు అతీతమైన పరమాత్మ అనబడే ఈశ్వరుడు. శ్రీ శంకర భగవత్పాదుల భాష్యములో 'క్షరాక్షరోపాధిద్వయ దోషేణ అస్పృష్టః నిత్యశుద్ధబుద్ధముక్తస్వభావః' అనియు 'ఈశ్వరః సర్వజ్ఞో నారాయణాఖ్య ఈశనశీలః' అనియు వివరించినారు. ఈ గ్రంథములో ప్రతిపాదించినది ఆ పురుషోత్తమ తత్త్వము కాదు.

కాబట్టి ఇటువంటి గ్రంథములలో పద ప్రయోగము చేయునప్పుడు దానిని ఏ యర్థములో ప్రయోగించుచున్నదియు ముందు పరిష్కరించి రచన సాగింపవలె. అట్టి ప్రయత్నము శ్రీ శాస్త్రిగారు ఈ గ్రంథములో కొంత చేసినారు. కాని వెంటనే విశేషార్థములో మరికొన్ని పదాలు వాడవలసిరాగా, వాని భావము అవగతము కాకుండుట తటస్థించినది.

శ్రీ శాస్త్రిగారన్నమాటలు కొన్ని ఎంత అపమార్గము పట్టించేవిగా ఉన్నవో కొన్ని ఉదాహరిస్తాను.

'శ్రీ శంకరాచార్యుల వారు ఎక్కడ బ్రహ్మజిజ్ఞాసను ముగించారో శ్రీరామకృష్ణ పరమహంస అక్కడ శక్తి జిజ్ఞాస ఆరంభించారు. దానిని శ్రీ అరవిందులు తమ Essays on Gita లో ప్రపంచించారు...ఎవడు బ్రహ్మమో అతడే కాళి; అతడే శక్తి. ఎవడు పురుషుడో అతడే ప్రకృతి మనం ఆ శక్తినే ఆ ప్రకృతినే 'అమ్మ' అనీ 'ముగురమ్మల మూలపుటమ్మ' అనీ అనేది. శ్రీరామకృష్ణుల కాళియే ఆయా శక్తియే ఆయా ప్రకృతియే గీతచెప్పిన తంత్రంచెప్పిన పరాప్రకృతి పరాశక్తి. ఈమెయే చిన్మయ చిద్రూపిణి అయిన బ్రహ్మశక్తి, సదాశివ–ఈశ్వర సద్విద్యగా చెప్పిన ఈ పరాశక్తియే ఈ పరాప్రకృతియె తదభిన్నమైన పురుషోత్తమ తత్త్వమే శ్రీ అరవిందుల Super Mind (పే. 23, 24).

మరల దానిని తర్వాతి అధ్యాయములో వివరింప నారంభించి అడుగడుగునా 'పంచదశి' చిత్రదీపంలో చెప్పిన తెరగుమాచేది' (పే. 25) అనీ, Life Divine లో ప్రకరణాలు చూచేది (పే. 26) అనీ, 'See–The Divine Maya' (పే 37) అనీ, మళ్లీ 'బృహదారణ్యకంలో పురుషవిధ బ్రాహ్మణం చూచేది' (పే. 60) అనీ, 'బృహదారణ్యకమునందలి అంతర్యామి బ్రాహ్మణము చూచేది' (పే 69) అనీ, 'ఈ అంతర్యామి ఎవరు? అనే విశేష విచారణ చిల్లంకొండ రామరాయలు గీతా వ్యాఖ్యలో చూచేది' (పే. 69) అనీ—ఈ విధంగా చూడవలసిన వానిని గ్రంథమంతటను నిర్దేశించినారు.

పైన ఉదాహరించిన పేరాలో ఎంత అసంబద్ధత ఉన్నదో విజ్ఞులు ఊహించగలరు. కొన్ని ప్రధాన విషయాలు సూచించెదను. 1. తంత్రము, గీత చెప్పినదే అరవిందులు చెప్పినదయితే, వారిది నవ్యతంత్రము కాదుగదా! 2. బ్రహ్మజిజ్ఞాస ప్రారంభించినది శంకరులు కాదు, వేదాంతములు. వేదాంత వాక్యాలకు ఏకవాక్యత కల్పించుటకు బాదరాయణులు బ్రహ్మసూత్రములు రచించి 'అథాతో బ్రహ్మజిజ్ఞాసా' అని ప్రారంభించినారు. బ్రహ్మసూత్ర వ్యాఖ్యాతలలో శంకరులు ఒకరు. శ్రీ మధ్వరామానుజాదులుకూడా వ్యాఖ్యాతలే. 3. శ్రీరామకృష్ణ పరమహంస జీవితము సూక్ష్మముగా పఠించి గ్రహించిన వారికి ఆయన శక్తి అనబడే అపరబ్రహ్మము ప్రథమములో ఉపాసించి, దానివలన బ్రహ్మవిద్యకు అధికారము సంపాదించి, శ్రీ తోతాపురిస్వాములవారియొద్ద సన్యాసాశ్రమము గ్రహించి పరమహంసయై, పరబ్రహ్మ సాక్షాత్కారము పొందిన జీవన్ముక్తుడు. కాబట్టి ఆయన ముక్తుడైనది అద్వైత విద్యవలననే. వారి జీవిత చరిత్రలు వ్రాసినవారందరు ఏకగ్రీవముగా వారికి తోతాపురి అద్వైతనిష్ఠ ఉపదేశించిన

సమయములో తమకు బ్రహ్మ సాక్షాత్కారమునకు అడ్డుగా కాళీమాత నిలిచియున్నదని రామకృష్ణులు నివేదింపగా, భ్రూమధ్యములో గాజు పెంకుతో వారు గీరిరనియు, అప్పుడు కాళి తొలగి బ్రహ్మ సాక్షాత్కారము పొందిరనియు వ్రాసినది గుర్తుంచుకొన వలెను. జీవిత చరిత్రలలోని ప్రతిచిన్నవిషయము సత్యముగా గ్రహింపక తాత్పర్యార్థము గ్రహిస్తే రామకృష్ణ పరమహంస ఉత్తీర్ణులైనది శంకర భగవత్పాదులు ప్రవర్తింపజేసిన అద్వైతనిష్ఠవల్లనే అని తేలగలదు.

అంతకుముందు వారు శక్తి ఉపాసనమేకాదు, భైరవీబ్రాహ్మణివలన మూలికోపాసన (గంజాయి మొదలయిన జ్ఞానవ్రతులు), దిగంబరులుగా శిఖాయజ్ఞోపవీతహీనులునై చేసే ఏవో ఉపాసనలు, క్రైస్తవ మతోపాసన, ఇస్లాము మతోపాసన— ఇంకా ఎన్నెన్నో చేసినవారే. దురదృష్టవశాత్తుగా రామకృష్ణులు గ్రంథ మేమియు వ్రాయలేదు. ఆయన చుట్టూ ముందు చేరినవారు ఆయనయందు భక్తి తాత్పర్యము లున్నవారేకాని శాస్త్రాదికములలోగాని, ఆచారములలోగాని ప్రవేశము లేనివారు. దహనము చేయగూడని పరమహంస శరీరమును ఆ శిష్యులు దహనముచేసిన సత్యవిషయమునుబట్టియే, వా రప్పు డెంతటి అవ్యక్తులో బుద్ధిమంతులు తెలిసికొనగలరు. వారి శిష్యులని తర్వాత ప్రసిద్ధులైనవారి కొక్కరికి కూడా వారుసన్యాసి దీక్ష ఈయలేదనునది గమనింప దగినది. ఆ శిష్యుల అప్పటి అధికారమునకు తగిన విధముగా వారు తమ పూర్వానుభవాదులు చెప్పుచు వచ్చుచుండిరని గమనింపవలెను. వారి జీవితచరిత్రల పూర్వ ముద్రణములలో చాతుర్వర్ణ్య వ్యవస్థ వారంగీకరించిరనియు, ఏ కులము వారు వారి ధర్మము అనుష్ఠింపవలెననియు చెప్పిన వాక్యములు కనబడును. 4. ఉపనిషద్వాక్యములలోనే ఒకే శబ్దము భిన్నార్థములలో ప్రయోగింప బడినది. ఆ పరస్పర విరోధముగా కనబడే వాక్యాలను సమన్వయించి ఏకవాక్యత చేకూర్చడానికే బాదరాయణ బ్రహ్మసూత్రములు పుట్టినవి. ఐనా ఆ సూత్రాలు ప్రమాణముగా గ్రహించిన మతాచార్యులకే భేదాభిప్రాయాలు కలిగినవి. శ్రీ మధ్వాచార్యులవారు ఉపక్రమణలోనే బ్రహ్మ శబ్దము విష్ణువునందే అన్వయించునని భాష్యారంభము చేసినారు. 5. తంత్రమతము వేదాంత విరుద్ధమైనదని సంప్రదాయ వేత్తల నిశ్చయము. బ్రహ్మ సూత్రములు రెండవ అధ్యాయము రెండవ పాదము అంతయు బహువిధములైన తాంత్రికమతములను, సాంఖ్య యోగ న్యాయ వైశేషికాదులతో సహా ఖండించుటకే పుట్టినది.

ఈ గ్రంథములో శ్రీ శివరామశాస్త్రిగారు ప్రతిపాదింప దలచినది అరవిందుల యోగము ప్రస్థానత్రయము (ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రములు, భగవద్గీత) ఉపదేశించిన వేదాంతమందురా? కాదుగదా! తాంత్రిక మతమందురా? అట్లైనచో ఏ తంత్రము ననుసరించినది? దేనిని ప్రత్యేకముగా కాదుగదా! వారిదొక స్వతంత్ర మతమనిగదా శ్రీ శాస్త్రిగారి భావము! అనుయాయు లున్నంతవరకు ఎన్ని క్రొత్త మతములైనను పుట్ట వచ్చును. శ్రీ శాస్త్రిగారికి ఉపనిషత్తుల కంటె తంత్రములు ఎక్కువ సత్య ప్రతిపాదకములు కావచ్చును. మరి కొందరికి అవి రెండును అసత్యములు, క్రైస్తవమే సత్యము. ఇంకను కొందరికి ఇస్లాము మతమే సత్య ప్రతిపాదకము. శ్రీ శాస్త్రిగారికి అరవిందులయోగమే పూర్ణయోగము, అతి నవ్యయోగము, సత్యయోగము అని తోచవచ్చును. అట్లైనచో సత్య ప్రతిపాదకములుకాని ఉపనిషత్తుల ప్రమాణము మధ్య మధ్య చొప్పించుట ఉచితము కాదు. సామాన్య పాఠకులను అవ మార్గములోకి లాగగలది.

శ్రీ అరవిందు లెంత గొప్పవారైనను మానవ మాత్రులు. పురుషప్రోక్తమైన ప్రతిదానికి పురుష

నిష్కృష్టమైన దోషములు సంక్రమింపక తప్పదనునది విశామాంసా నిర్ధారిత సత్యము. శ్రీ అరవిందులు ప్రతిపాదించిన పూర్ణయోగమునకు ఈ దోషము పట్టి తీరుతుంది మా బోంట్ల దృష్టిలో వారికున్న పురుష సహజ దోషాలు ప్రధానమైనవి రెండు. 1. ఒకటి వారి అసాధారణ విద్వత్తు 2. వారి కవితాశక్తి.

శ్రీ అరవిందులను ప్రథమములో అత్యధికముగా ఆకర్షించినది గ్రీకు సాహిత్యము, విజ్ఞానము. గ్రీకు దేవతలు దివ్యత్వమున్న మానవులు. దివ్య మానవ సంయోగము అరవిందులనెంతో ఆకర్షించినది. వారు రచించిన నాటకము 'Perseus the Deliverer' ఈ సంభాషణముతో ముగించినది.

Cassiopia : How can the immortal gods
and Nature change?
Perseus : All alters in a world that is
the same
Man most must change who
is a soul of Time;
His gods too change and live
in larger light.
Cepheus : Then man too may arise to
greater heights,
He is being draw nearer to
the gods?
Perseus : Perhaps.
But the blind nether forces still
have power
And the ascent is slow and long
is Time.
Yet shall Truth grow and harmony
increase;
The day shall come when men feel
close and one.
Meanwhile one forward step is
something gained,
Since little by little earth must
open to heaven
Till her dim soul awakes into the
Light.

ఈ భావనలో కవీశ్వరులు ఆదికాలమునుండి కంటూఉన్న దివ్యస్వప్నాలు ఎంత రమణీయంగా ప్రతిఫలించినవి!

అటువంటిదే దివ్యస్త్రీయైన ఊర్వశికి పురుష సింహుడైన పురూరవునికి కలిగిన ప్రేమ. దానిని 'ఊర్వశి' అనేకావ్యములో చిత్రించినారు. ఆ యాకర్షణతోనే వారు కాళిదాసుని విక్రమోర్వశీయమును ఆంగ్లమున అనువాదము చేసినారు.

అట్లే వారిని ఆకర్షించినది ప్రేమ మృత్యువును జయింపగలదనే కావ్యసత్యము. గ్రీకు వాఙ్మయములో గాయకాగ్రేసరుడయిన ఆర్ఫియను చనిపోయిన తన ప్రియురాలిని ప్రేతలోకమునుండి తిరిగి తెచ్చుటకు యత్నించి కొంత సఫలుడై తుదకు విఫలుడైన కథ ముందు వారి నాకర్షించినది. తర్వాత భారతీయ వాఙ్మయము పఠింపగా ఆ కథకు పోలికలున్న ప్రమద్వరారురుల కథ ఆకర్షించినది. దానిని Love and Death అనే కావ్యములో చిత్రించి గ్రీకు భారతీయ పురాణ భావనలను మనోజ్ఞముగా జోడించినారు. దానితో కూడా వారికి తృప్తి కలుగలేదు. సావిత్రీకథ కొంతవర కట్టిదే కాని ఆమె ప్రేమ, విషయవాసనలకు అతీతమైనది. ఆమె ఒకవిధముగా మృత్యువును జయించినది. ఆ కథ ఆధారముగా శ్రీ అరవిందులు 'సావిత్రి' అనే ఉత్తమోత్తమ కావ్యము రచించినారు. అందులో వారి విద్వత్తు, కవితాశక్తి, యోగసాధనల ఫలము మూర్తీభవించినవి. దానితో వారు విశ్వకవులలో ఉన్నతస్థానము సంపాదించుకొని కృతకృత్యులైనారు.

అరవిందుల Collected Poems and Plays ప్రచురిస్తూ Publisher's Note లో ఇట్లా వ్రాసినారు :

"Sri Aurobindo once said that he had been first and foremost a poet and a politician, only later he became a Yogi. You can safely amend the statement by saying that even before he became a politician he had been a poet. This aspect of Sri Aurobindo is not, at least has not been, so well known except in a small select circle."

అంతేకాదు. శ్రీ అరవిందుల యోగమంతా కూడా వారి కవిత్వములోనే పర్యవసించినదనడము అత్యుక్తి కానేరదు.

ఈ గ్రంథమం దంతటను అస్పష్టత, పరస్పర విరుద్ధవాక్యాలు, అపసిద్ధాంతాలూ కానవస్తున్నవి. ఈక్రింది ఉదాహరణలు కొంత వాని స్వరూపము ప్రదర్శింపగలవు.

'ఈశ్వరునితో జీవుని ద్వైతాద్వైతలీల ఉర్దం విద్యాతత్త్వంలో కనబడుతుంది...అరవిందుని తంత్రం అద్వైతానికీ తంత్రానికి ముందడుగు' అన్నారు 26 వ పేజీలో. ఇందులో మొదటివాక్యము త్రిక సిద్ధాంతానికి భాషాంతరీకరణమే. ఈ తంత్రం అద్వైతానికి ముందడుగుకాదు, వెనుకడుగు!

'అట్టిదానిని ప్రాచీన ఋషులు 'మాయ' అని అన్నారు. అది దిగువమాయ కాక ఎగువమాయ. దేవమాయ. అది పరానందచిత్తుయొక్కయే బలం— వీర్యం. అరవిందునిభాషలో ఈ దేవమాయ అనంత సన్మాత్రంలోని అసీమమూ విశాలమూ ఐన సత్యసామగ్రిని చక్కగా అవగతం చేసుకొని గుర్తుపెట్టుకొని ఒక హద్దున ప్రమితంవేసి.. దానిలో నామరూపాలను వికసింపజేస్తుంది... మొదట మొదట సమష్టిలో వ్యష్టిలీలను వ్యష్టిలోనసమష్టిలీలను మన మనోలీల - లేక దిగువమాయ—మనకు తెలియకుండా చేస్తుంది... కాబట్టి ఈమలినమాయను తొలగదోసికుని పై దేవమాయను అవలంబించాలి' అన్నారు ఒకచో (పే. 34, 35).

మరొకచోట, 'ప్రకృతం మనకు కలిగిన ఈఅవస్థలో ఇంత అసంపూర్ణతా, ఇంత అతృప్తీ. కాగా ప్రాతిభాసికరూపాన్ని రూపాంతరం పొందించాలని అల్లి అధ్యాత్మసత్తకు ఎంతో ఆకులత, ఎంతో ప్రయత్నం. కాబట్టి పరమసత్తను చిద్రూపాన్ని విశ్వాన్ని ఈమూటినికూడా సత్యం అని ఎన్నాలి. పరమసత్తాయున్నూ విశ్వమున్నూ నిర్విశేషమున్నూ కేవలం నిత్య విరుద్ధాలని అనుకుంటే పొగదు' అన్నారు. (పే. 37, 38). ఇది అర్థమైనంతవరకు త్రిక సిద్ధాంతము అనువాదమే.

పేజీ 57 లో 'ఇప్పుడు పరానికీ అవ(ప)రానికీ నడుమ ప్రస్ఫుటరూపమైన అతిమానస తత్త్వం Supermind ఒకటి ఉన్నదని చెప్పడానికి ప్రయోజనమేమిటో దానిని చూచాయగా తెలిసికోగలిగినాము. దాని పరిచయమున్నూ కొంత కొంత వేదంలో ఉందని చూడకలిగినాము' అన్నారు.

పేజీ 51 లో 'సర్వభూతాలలోనూ బ్రహ్మము, సర్వభూతాలూ బ్రహ్మములో, అన్ని భూతాలూ బ్రహ్మమే - అనే ఇది సర్వజ్ఞమయిన అతిమానసం యొక్క త్రివిద్యారూప గాయత్రి...అసంకీర్ణమయిన ఆత్మదృష్ట్యనుభవంచేత అవిభక్తమయిన ఈ పరమ విద్యయే విశ్వంలో అతిమానసమూలమంత్రం' అన్నారు. పైదానిలో సర్వభూతాలలోనూ బ్రహ్మమూ, సర్వభూతాలూ బ్రహ్మములో అన్నంతవరకూ వేదాంత దర్శనం ఉద్ఘోషిస్తున్నది. ప్రత్యక్షంగా అన్నిభూతాలూ బ్రహ్మమేఅనేది త్రికమతానువాదము, మాయకు బద్ధులైనవారి భ్రాంతి!

51 వ పేజీలో 'ఒక మాటలో చెపితే సృష్టి యావత్తూ అభివ్యక్తి నివృత్తుల ఊయాల ఊపు' అన్నారు. ఇది స్పందవాదులు చెప్పే మాటే.

మరొకచోట, 'ఈ విశ్వపరిణామజ్ఞానం నేటి కాలపు ప్రాతిభాసిక పరిణామవాదుల మతాలలోనూ ప్రాచీనవేదాంతాలలోనూ, దర్శనాలలోనూ కనబడుతుంది. ప్రాచీన ఋషులు ఆనాడు విశ్వపరిణామ లీలను ఎట్లా చూచారో అట్లా నేటి వైజ్ఞానికులున్నూ జడశక్త్యుభయతత్త్వాలోచనం చేసుకుంటూ వచ్చి చూస్తున్నారు. కాని యాథార్థ్యాని కింకా ఎడంగానే ఉన్నారు' అన్నారు 31 వ పేజీలో.

ఈపథంగా చెప్పిచెప్పి గ్రంథసమాప్తి ఇలా చేశారు. 'ఇంతవరకూ మన బుద్ధికి భిన్నగా ప్రచురం కాని స్పష్టంకాని భాషలో దీనిని తెలపడానికి చాలా శ్రమించానుకాని కడుదవ్వుగాఉన్న ఈ అతిమానసం యొక్క అనుభవం పొందడంకంటె ఆ అతిమానసం యొక్క ప్రజ్ఞాన రూపాన్ని తెలుసుకోవడమూ అనుభూతిలోకి తెచ్చుకోవడమూ మనకు చాలా సహజం. ఎట్లాగంటే మన కా ప్రజ్ఞానచైతన్యం ప్రతివేశి— మన పొరుగింటిదే. మన మనస్సుయొక్క క్రియాకలాపాల పూర్వాభాస దాంట్లో ఉంది. కాగా మనం దాటవలసిన అంతఅడ్డంకి అంత గడ్డుది కాదు.' (పే. 84.)

పై వాక్యాలలో శ్రీ శాస్త్రిగారు అరవింద తత్త్వము చెప్పడము తేలిక కాదని ఒప్పుకున్నారు. కాని అది అనుభవములోనికి తెచ్చుకోవడముమాత్రము చాలా సులభమన్నారు. అంత తేలికైన అనుభూతి

సృష్ట్యాదినుండి ఇంతవరకూ మానవులకు భాసించనే లేదా? ఇప్పుడు దాని అనుభవంచేత ఉత్తీర్ణులైన వారు ఎవరైనా ఉన్నారా?

కేవల భాషా పాండిత్యముతో వేదవేదాంత వాక్యాలు అన్వయము చేసికొనడానికి యత్నము చేసే వారికి తప్పక అప్రమాణబుద్ధి ఎదుర్కొంటుంది. శ్రీ శాస్త్రిగారివంటి వారు శంకరభగవత్పాదులవంటి వారిని తృణీకరించి వ్రాయుట ఆస్తికులకు బాధ కలిగిస్తుంది. కాని పెద్దలైన ఇతరులు కొందరు పూర్వమే అది చేసినవారు గనుక పరిపాటియై కొంత సహించడము సాధ్యమవుతుంది. కాని శాస్త్రిగారివంటి వారి కలమునుండి 'వేదముచేసే సూచన ఇంతవరకే' (పే. 44)వంటి వేదనిందచేసే వాక్యాలు మాత్రము ఆస్తికు లెవ్వరు, అద్వైతులు, ద్వైతులు, విశిష్టాద్వైతులు సహించేవి కావు.

శ్రీ శాస్త్రిగారు ప్రదర్శించినట్లు, అరవిందుల నవ్యతంత్రం 'ఒక కొత్త లక్ష్యానికి బాటవేసింది. ఇది ప్రకృతినే రూపాంతరంగా మార్చివేయడం' (పే. 6) అన్నదీ, 'అప్పుడు సాధకుని శరీరంలో ప్రకృతి సహజములని అనుకొనబడే చావు పుట్టు మొదలయిన ధర్మా లుండవు' అనే మాటలు నిజంగా అరవిందుల నవ్యతంత్రానికి అన్వయించేవి అయితే, అది ఛాందోగ్యోపనిషత్తు 8 వ ప్రపాఠకము, 7, 8 ఖండములలో ఆత్మస్వరూపము తెలిసికొనగోరి ఇంద్రుడు విరోచనుడు 32 సంవత్సరాలు శుశ్రూష చేసినతర్వాత ప్రజాపతి చెప్పినమాటలతో తృప్తిపడి విరోచనుడు అసురులకు ఉపదేశించిన ఆత్మవిద్యయొక్క రూపాంతరమే కాని మరి ఏదియు కాదని నిశ్చయింప వచ్చును. మనోహరమైన ఆయాఖ్యానము జగత్ప్రసిద్ధము కావున వివరింపనక్కరలేదు. విరోచనుడు అసురులకు ఉపదేశించినది దేహాత్మభావమని క్లుప్తముగా చెప్ప దగును. వేదాంత పరిభాషలో అది అజ్ఞానానికి, పరమావధి!

ఆ యుపనిషత్తులోనే 6 వ ప్రపాఠకములో 1 వ ఖండములో శ్వేతకేతువు 12 సం॥ లు వేదాధ్యయనముచేసి తాను గొప్పవాడను పెద్ద విద్వాంసుడను అను నభిమానముతో తండ్రియొద్దకు వచ్చిన కథ కూడా స్మరణకు వస్తున్నది.

ఛాందోగ్యములోనే 7 ప్రపాఠకములో బ్రహ్మవిద్య నుపదేశింపుమని సనత్కుమారుని నారదుడు దర్శించిన ఉపాఖ్యాన మున్నది అప్పటికి నారదుడు నేర్చినవిద్యలు ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అధర్వణము పంచమవేద మనబడు ఇతిహాసపురాణములు, వేదములకు వేదమగు వ్యాకరణము, శ్రాద్ధకల్పము, గణితము, దైవజ్ఞానము, నిధిశాస్త్రము, తర్కశాస్త్రము, నీతిశాస్త్రము, నిరుక్తము, శిక్షా, కల్పము, ఛందస్సు భూతవిద్య, జ్యోతిషము. సర్పవిద్య. నృత్యగీతవాద్య శిల్పాది విజ్ఞానము. ఐనను శోకాకులచిత్తుడై సనత్కుమారుల నాశ్రయించి బ్రహ్మవిద్య నుపదేశింపుమని ప్రార్థించెను. సనత్కుమారులు నారదుని కెన్నో ఉపాసన లుపదేశించి క్రమక్రమముగా బ్రహ్మనిష్ఠుని గావించిరి.

శ్వేతకేతువు కూడన ట్లే వాత్సల్య పూర్ణుడైన తండ్రియగు నుద్దాలకుని యుపదేశముపొంది ఎన్నో ఉపాసనలుచేసి తుదకు బ్రహ్మనిష్ఠుడయ్యెను.

పురాణకథలనబడే పైయాఖ్యానములను వదలి చరిత్ర కందే పురుషుడైన కవి ధూర్జటి యార్తి విందాము. తన గురుస్వరూపుడైన కాళహస్తీశ్వరు నితో ఇట్లా మొర పెట్టుకున్నాడు.

'బోధావిర్భావనిధానముల్ చదువులయ్యా? కావు! నిగాపాదసంసేవాసక్తియె కాని జంతుతతికిన్ శ్రీకాళహస్తీశ్వరా!'

కేవలము చదువులు చదువుకున్న వారిని గూర్చియే దుర్గాసప్తశతిలోని సుమేధస్సు చెప్పిన మాటలు!

'జ్ఞానినా మపి చేతాంసి దేవీ భగవతీ హి సా
బలా దాకృష్య మోహాయ మహామాయా ప్రయచ్ఛతి!'

ఆ మహామాయ మనలను మన చదువులచే మోహమార్గములోనికి లాగక, జ్ఞానమార్గములోనికి ఒక్క అడుగైనా ముందుకు వేసేట్లు అనుగ్రహించు గాక!

—నోరి నరసింహ శాస్త్రి.

Printed and Published For Nageswara Rao Estates (Private) Ltd., by Radhakrishna at the Andhra Patrika Press. 6 & 7, Thambu chetty Street, Madras-1.
Editor : S. Sambhu Prasad.

Bharati    June 7 th 1968    Regd. No. M. 8856

# భారతి

## ప్రకటన రేట్లు

| కవరు పేజీలు | | కాజువల్ రేట్లు | కాంట్రాక్టు రేట్లు |
|---|---|---|---|
| 4 వ కవరు పేజి | ... | రు. 175/– | రు. 150/– |
| 2 లేక 3 వ కవరు పేజి ... | | | |
| ఒకే (నలుపు) రంగు | ... | రు. 150/– | రు. 125/– |
| **లోపలి పేజీలు** | | | |
| పూర్తి పేజి | ... | రు. 125/– | రు. 100/– |
| అర పేజి | ... | రు. 65/– | రు. 55/– |
| పావు పేజి | ... | రు. 40/– | రు. 35/– |

ప్రత్యేక స్థానమునకు 25 అదనం.

సంచికకు వరుసగా 6 ప్రకటనలు చేయువారికి కాంట్రాక్టు రేట్లు వర్తించును."

## చందా వివరములు

| | | |
|---|---|---|
| సంవత్సర చందా | ... | రు. 12–0–0 |
| 6 మాసముల చందా | ... | రు. 6–0–0 |
| విడి ప్రతి | ... | రు. 1–0–0 |

మేనేజరు, భారతి.

మద్రాసు–1.